


'చందమామ' యొక్క
మజా మరింత పెరుగుతుంది
ఎప్పుడైతే మ్యాంగో బైట్
కూడా ఉంటుందో

# ఉచితం!

ఎక్కువ
సంబరం
తక్కువ
పంచ్‌లకు

బోర్డ్ గేమ్




25 రావర్లు

స్టిక్కర్లు




10 రావర్లు

మీకెంతో ఇష్టమైన ప్యారీస్ కోకోనట్ పంచ్‌లు
హాయిగా తినండి.
పై రావర్లు మాత్రం మాకు పంపండి.
25 రావర్లు ఇస్తే ఇంచక్కని బోర్డ్ గేమ్.
10 రావర్లు ఇస్తే
అందమైన స్టిక్కర్లు దొరుకుతాయి.
త్వరపడండి. పంపడం మొదలు పెట్టండి మరి.

మీ పేరు, పుట్టిన తేదీ, పూర్తి చిరునామాతో
రావర్లను పి.ఒ. బాక్స్ 7002,
మద్రాసు - 600 092కు పంపండి.
1995 ఫిబ్రవరి 28 వరకే ఈ నదుపాయం.
ఈ నదుపాయం లేకుండా కూడా ప్యారీస్
కోకోనట్ పంచ్ లభ్యం.




అదిరిపోయే రుచి

# BAND-AID®

# Funtest

## ప్రతి బ్యాండ్-ఎయిడ్ ఫన్‌టెస్ట్ ప్యాక్‌తో రెండు ఫన్‌స్టిక్స్* ఉచితం




## మీ ఫన్‌స్టిక్స్*ని పోగుచేయడం మొదలెట్టండి ఇప్పుడే!

*మనానవగల ప్లాస్టిక్ రేయాన్స్

నియమాలు, నిబంధనలు

1. ఈ పోటీలో 4 నుండి 15 సంవత్సరాల మధ్య వయసులోని పిల్లలు పాల్గొనేందుకు అర్హత వుంది. కేవలం భారతీయ పౌరులే దీన్లో పాల్గొనే అర్హత వుంది.
2. జాన్సన్ అండ్ జాన్సన్ మరియు ఒగిల్వీ మేథర్ సంస్థలలో పనిచేసే ఉద్యోగులూ, వారి బంధువులూ వీరికి పాల్గొనే అర్హతలేదని సాదరమైన సూచన.
3. ఒక వ్యక్తి ఎన్ని ఎంట్రీలైనా పంపవచ్చును.
4. ప్రతి ఎంట్రీ పూర్తిగా వుండాలి. అసంపూర్తి అయినవి, లేదా అర్హతలేని ఎంట్రీలూ రద్దుచేయబడ్డవాటిగా పరిగణిస్తాం.
5. ఎంట్రీలు పంపవలసిన ఆఖరు తేదీ, 28 ఫిబ్రవరి, 1995. అయితే యీ ఆఖరి గడువు తేదిని పొడిగించే లేదా వెనక్కి మార్చే హక్కు, కంపెనీ వారికి చెందుతుంది.

# బ్యాండ్-ఎయిడ్®

# ఫన్‌టెస్ట్‌లో పాల్గొనండి

జాన్సన్ అండ్ జాన్సన్

మీరు చేయవలసిందల్లా ఒక స్ట్రిప్ పెయింట్ చెయ్యడం, సరళమైన కొన్ని ప్రశ్నలకి జవాబులివ్వడం, అంతే. ఇక బోలెడన్ని సరదా అయిన బహుమతులు మీవే, గెలుచుకునేది మీరే.

దాంతో బాటు ముందుగా ఎంట్రీలు పంపేవారికి **1000** బహుమతులు (మరందుకే మీ ఎంట్రీని పంపండి వేడే!)













**ఫన్‌స్ట్రిప్ తయారుచేయండి!**

మీ ఆలోచనతో యీ బ్యాండ్ -ఎయిడ్ ని ఫన్ స్ట్రిప్‌గా రూపొందించండి. మీరు రంగు వాడవచ్చు, చిత్రం గియ్యవచ్చు లేదా దానిపై వ్రాయవచ్చును, అది చక్కని ఫన్ స్ట్రిప్ అయ్యేలా.

సరియైన జవాబుకి ✓ మార్క్ పెట్టండి

1. బ్యాండ్ -ఎయిడ్ స్ట్రిప్ సైజు ఏమిటి?
☐ 19 మి.మి. X 72 మి.మి. ☐ 17 మి.మి. X 70 మి.మి. ☐ 21 మి.మి. X 74 మి.మి.
2. కేవలం జాన్సన్ అండ్ జాన్సన్ వారి బ్యాండ్ -ఎయిడ్ స్ట్రిప్స్ మాత్రమే పూర్తిగా స్టెరిలైజ్ చెయ్యబడినవి.
☐ నిజం ☐ అబద్ధం
3. ది బ్యాండ్ -ఎయిడ్ ఫన్ టెస్ట్ ప్యాక్‌లో ఎన్ని బ్యాండ్ -ఎయిడ్ స్ట్రిప్స్ (అన్ని రకాలూను) వున్నాయి?
☐ 20 ☐ 15 ☐ 30
4. బ్యాండ్ -ఎయిడ్ ప్యాడ్ పైనగల ప్రభావంగా పనిచేసే మందు ఏమిటి?
☐ బోరిక్ పౌడర్ ☐ బెంజల్ కోనియమ్ క్లోరైడ్ ☐ టించర్ అయోడిన్
5. భారతదేశంలో, బ్యాండ్ -ఎయిడ్ స్ట్రిప్స్ పైన ఎన్ని వాల్ట్ డిస్నీ పాత్రలు కనిపించాయి?
☐ 4 ☐ 6 ☐ 2

పేరు: ______

పుట్టిన తేదీ: ______ ఆడ/మొగ: ______

అడ్రసు: ______

స్కూలు పేరు: ______

6. ఏ ఎంట్రీ తిరిగి పంపబడదు.
7. విజేతలకి పోస్టులో సమాచారం అందించబడుతుంది.
8. న్యాయనిర్ణేతల నిర్ణయమే తుదినిర్ణయం.
9. ఈ స్కీమును ఏ కారణముగా మార్చినాపో/మార్చకుండాపో, మార్పుదానికి లేదా ఉపసంహరించుకోడానికి గల ఆ హక్కు జాన్సన్ అండ్ జాన్సన్ వారికి చెందుతుంది.
10. ఎంట్రీ ఫారమ్‌లు అన్నీ సాధారణమైన పోస్టులో వీరికి పంపాలి: ది బ్యాండ్-ఎయిడ్ ఫన్ టెస్ట్, C/o. డేటామేటిక్స్, పి.బి. బాక్స్-16605, బొంబాయి-400 019.



# చందమామ

జనవరి 1995



ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు





విడి ప్రతి : **5.00**

సంవత్సర చందా : **60.00**




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## బాలలు - పర్యావరణ రక్షణ!



బాలబాలికలలో పర్యావరణ రక్షణ పట్ల ఆసక్తిని పెంపొందించడం ఎలా? అన్న విషయం మీద పదేళ్ళ క్రితం ఒక పోటీ జరిగింది. ఆ పోటీలో పాల్గొని, విజేతలై బహుమతులు స్వీకరించడానికి ముప్పైమంది ఢిల్లీకి వచ్చారు. నాటి సభకు ముఖ్య అతిథిగా సుప్రసిద్ధ పర్యావరణ పరిరక్షకుడు సుందర్ లాల్ బహుగుణ వచ్చాడు. ఆయన విజేతలను చూసి, "మీలో ఎంత మంది, మీ చేతులతో స్వయంగా మొక్కలు నాటారు?" అని అడిగాడు. ఒక్కరు కూడా సమాధానం చెప్పలేదు!

"యేడాదిలోగా ఫలితం కావాలంటే వ్యవసాయం చేయండి. మీ సంతతి లాభం పొందాలంటే చెట్లు నాటండి," అని ఒక చీనా సామెత చెబుతుంది.

చెట్టుచేమల పట్ల ఆసక్తినీ, పర్యావరణ పరిరక్షణ పట్ల శ్రద్ధనూ బాల్యం నుంచే కలుగజేయడం మంచిది. ఈ అవసరాన్ని గుర్తించి, ఇటీవల బడి ఆవరణలో ఏమాత్రం స్థలం ఉన్నా, అందులో మొక్కలు నాటి పెంచడానికి విద్యార్థులను ప్రోత్సహిస్తున్నారు. ఒరిస్సాలో ఒక ఉపాధ్యాయుడు, ఒక విద్యార్థినిని, ఆమె నాటిన మొక్క దగ్గరికి వెళ్ళి రోజూ కొంతసేపు పాడమన్నాడు. రెండు నెలలలో ఆ మొక్క, మిగతా మొక్కలకన్నా ఏపుగా పెరిగింది. మనలాగే మొక్కలు కూడా ప్రాణం కలవి అని పిల్లలు గ్రహించే విధంగా చేయడానికే ఆ ఉపాధ్యాయుడు అలా చేశాడు. చెట్లను గురించి కేవలం పాఠాలు వినడంకన్నా, చెట్లను నాటి, పెంచడం వల్ల పిల్లలలో వాటిని గురించిన ప్రత్యక్ష అవగాహన కలుగుతుంది!



సంపుటి : 97 జనవరి '95 సంచిక : 1

విడిప్రతి : 5.00 సంవత్సర చందా : 60.00



వార్తలు - విశేషాలు:

# హెల్మట్ ఖోల్ విజయం!

జర్మనీలో గత నవంబర్ 16వ తేదీ జరిగిన సాధారణ ఎన్నికలలో ఛాన్సలర్ హెల్మట్ ఖోల్ నాల గవసారి మళ్ళీ విజయం సాధించాడు. 1982వ సం॥లో అప్పటి పశ్చిమ జర్మనీలో జరిగిన ఎన్ని కలలో ఆయన మొట్టమొదట ఎన్నికయ్యాడు. 1992వ సంవత్సరంలో జర్మన్ కుడ్య పతనానంతరం ఉభయ జర్మనీలు ఏకమయ్యాక జరిగిన మొట్టమొదటి ఎన్నికలలో ఖోల్ మూడవ సారిగా ఎన్నికయ్యాడు.

1990వ సం॥లో జరిగిన ఎన్నికలలో ఖోల్ అధికార పక్షాలు దాదాపు 55 శాతం ఓట్లు గెలుచు కున్నాయి. కాని ఈసారి కొందరు భాగస్వామ్య పక్షాల సభ్యులు దెబ్బతినడంతో చాలా స్వల్ప ఆధిక్య తనే సాధించగలిగాయి. అంటే 48.3 శాతం ఓట్లు మాత్రమే గెలుచుకున్నాయి. ప్రతిపక్షాలు 48.1 శాతం ఓట్లు గెలుచుకున్నాయి. అందువల్ల ఖోల్ నాలుగేళ్ళు పూర్తిగా పదవిలో కొనసాగగలడా అని కొందరు అనుమానం వ్యక్తం చేస్తున్నారు. అలా పూర్తి చేసినట్టయితే హెల్మట్ ఖోల్ – అంతకు ముందు పధ్నాలుగేళ్ళు అధికారంలో కొనసాగిన మాజీ ఛాన్సలర్ కోన్రాడ్ అడిన్యూర్ రికార్డును అధిగమించగలడు.

జర్మనీ ప్రజలు అధికార మార్పిడిని కోరడం లేదు. అందుకే హెల్మట్ ఖోల్ పక్షమైన క్రిస్టియన్ డెమొక్రట్స్‌కు దానికి భాగస్వామ్య పక్షాలైన బవేరియన్ క్రిస్టియన్ పార్టీకి, లిబరల్ డెమొక్రట్స్‌కు అధికారం అప్పగించారని రాజకీయ పరిశీలకులు అభిప్రాయపడుతున్నారు. పాలకులకు మళ్ళీ మరొక అవకాశం ఇచ్చినప్పటికీ అంత ఆధిక్యత లేకపోవడం గమనించతగ్గ విశేషంగా చెబుతున్నారు.



ప్రధాన ప్రతిపక్షమైన 'సోషల్ డెమొక్రట్స్' తాము అధికారంలోకి వస్తే ప్రస్తుతం వర్ధమాన దేశాలకు ఆర్థిక సహాయం అందజేస్తున్న 'మినిస్ట్రీ ఆఫ్ ఎకన మిక్ కోఆపరేషన్'ను రద్దు చేస్తామని మేనిఫెస్టోలో ప్రకటించారు. జర్మనీ ఆర్థిక సహాయాన్ని పొందుతున్న వర్ధమాన దేశాలలో మనదేశం ఒకటి. ఈ సహాయం కొనసాగడానికి ఖోల్ విజయం దోహదం చేస్తుంది.

ఛాన్సలర్ హెల్మట్ ఖోల్ 1990వసం॥లో ప్రతి ష్ఠాత్మకమైన జవహర్‌లాల్ నెహ్రూ అవార్డు అందు కున్న విషయం (చందమామ జనవరి 1992) పాఠకులకు తెలిసినదే.

# బాకీవసూలు

భద్రయ్య, నారాయణశెట్టి ఊరి రచ్చబండ దగ్గర కూర్చుని లోకాభిరామాయణం ముచ్చటించుకుంటున్నారు. ఇంతలో చలమయ్య అనేవాడు అక్కడికి హడావిడిగా వచ్చి, "అయ్యా, నారాయణశెట్టిగారూ! వచ్చిన గండాన్నుంచి మీరే రక్షించాలి. వందవరహాలు అవసరమయినై. రెండు, మూడు నెలల్లో వడ్డీతో సహా ఇచ్చుకుంటాను," అన్నాడు.

"అది సరే! నీ నిజాయితీని నేను శంకిస్తున్నాననుకోకు. ఏమైనా డబ్బు వ్యవహారం కదా! నీ నిజాయితీ గురించి మరొక పెద్దమనిషి రెండు ముక్కలు చెబితే, నాకు సంతోషంగా వుంటుంది," అని, భద్రయ్యకేసి చూశాడు నారాయణశెట్టి.

వెంటనే భద్రయ్య, "ఒక రోజు అటూఇటే గాని, తీసుకున్న డబ్బు వువ్వుల్లో పెట్టి మరీ తిరిగిచ్చే మనిషి చలమయ్య. డబ్బు అతడి దగ్గరున్నా, మీ ఇనప్పెట్టెలోవున్నా ఒకటే," అన్నాడు.

ఆ సాయంత్రమే వందవరహాలు చలమయ్యకు అప్పిచ్చి పంపాడు నారాయణశెట్టి.

ఆ మర్నాడు వీధిలో ఎదురుపడిన నారాయణశెట్టితో, భద్రయ్య, "ఆ చలమయ్య విషయంలో జాగ్రత్త సుమండీ! తిరిగి తిరిగి చెప్పులరిగిపోవాల్సిందేకాని, ఇచ్చిన డబ్బు ఒకపట్టాన తిరిగి రాదు!" అన్నాడు.

"అయితే, నిన్న వాడి నిజాయితీ గురించి అలాఎందుకు చెప్పారు?"అని ఆశ్చర్యంగా అడిగాడు నారాయణశెట్టి.

"అదేముందిలెండి! వాడికి రెండేళ్ళ క్రితం అప్పిచ్చిన ఇరవై వరహాలు రాబట్టుకోవడానికి వేరే మార్గం కనబడ లేదు. నిన్న సాయంత్రం, మీరిచ్చిన డబ్బుతో వాడు వీధిలోకి రాగానే నిలవేసి, నా ఇరవై వరహాలూ వడ్డీతో సహా వసూలు చేసుకున్నాను," అంటూ ముందుకు సాగిపోయాడు భద్రయ్య.

—బి. రఘురామరాజు






# నేను - మేము

రంగపురంలో మాధవుడనే యువకుడుండేవాడు. చిన్నతనంలోనే అనేక కావ్యాలు, శాస్త్ర గ్రంథాలు చదివినవాడని అందరూ వాడిని మెచ్చుకునేవారు. ఎవరే విషయం గురించి అడిగినా, శాస్త్రాలు ఆధారంగా చేసుకుని వివరణ చెబుతూండేవాడు మాధవుడు. వాడి తెలివికి చాలామంది ఆశ్చర్యపడేవారు. క్రమంగామాధవుడిలో గర్వం, అహంకారం చోటు చేసుకున్నాయి.

ఒకసారి ఆ గ్రామానికి తేజస్వి అయిన ఒక సన్యాసి వచ్చాడు. గ్రామం వాళ్ళాయనకు బ్రహ్మరథం పట్టారు. ఆయన చేసే నీతి బోధనలు శ్రద్ధగా విన్నారు. అంతటి వాణ్ణి చూసి వుండలేదని ఎంతో గొప్పగా చెప్పుకోసాగారు.

సన్యాసిని చూస్తే మాధవుడికి అసూయ కలిగింది. ఆయన చేసే నీతిబోధనలు గొప్పగా ఏమీ లేవు. కానీ జనం ఊరికే పొగిడేస్తున్నారు. తనకైతే అంతకంటే బాగా ఎక్కువ తెలుసు. కానీఊరిజనం తననింతగాఎప్పుడూపొగడలేదు!

మాధవుడు ఒకనాడు సన్యాసిని కలుసుకుని, "స్వామీ! తమరేం చదువుకున్నారు?" అని అడిగాడు.

"పూర్వాశ్రమంలో వుండగా, నా తల్లిదండ్రులు ఎన్నో ప్రయత్నాలుచేశారు కానీ, నాకు చదువు రాలేదు. నేనేమీ చదువుకోలేదు," అన్నాడు సన్యాసి.

"అయితే తమరు నీతి బోధనలెలా చేస్తారు?" అని అడిగాడు మాధవుడు కాస్త వేళాకోళంగా.

దానికి సన్యాసి ఎంతో శాంతంగా, "అన్నీ పుస్తకాల లోనే రాసి వుండవు, నాయనా! అనుభవం మనిషికి ఎన్నో పాఠాలు నేర్పుతుంది. నేను నేర్చుకున్నవి ప్రజలకు చెబుతున్నాను," అన్నాడు.

"కొందరు తమ అనుభవాలను పుస్తక రూపంలో రాశారు. అలాంటి పుస్తకాల్లో మీరు

జొన్నలగడ్డ రామలక్ష్మి



నాకు, ప్రజల నుంచి మీకు లభించే గౌర వంలో వెయ్యో వంతు కూడా లభించడం లేదు," అన్నాడు.

"నా నీతి బోధనలు వినమని నేనెవరికీ చెప్పలేదు. గౌరవించమని నేనెవరినీ అడగ లేదు. ప్రజలు నా పట్ల చూపే శ్రద్ధాసక్తులు, నాకిచ్చే గౌరవం నాకు సంతోషాన్ని కలిగించడం లేదు. నేను వాటిని పట్టించుకోవడం లేదు. నువ్వూ పట్టించుకోకు. మనిషికి చదువు రావడమే అదృష్టమని గుర్తుంచుకో," అన్నాడు సన్యాసి.

దానికి మాధవుడు విసుగ్గా, "నాకంటే తక్కువ చదువుకున్న మీరు నాకు సలహా ఇవ్వకూడదు. కావాలంటే నాతో శాస్త్రవాదనకు దిగండి. మిమ్మల్ని ఓడిస్తాను. అప్పుడు ప్రజలు నన్ను మరింత ఎక్కువగా గౌరవిస్తారు," అన్నాడు.

సన్యాసి నవ్వి, "నేను చదువుకోకపోయినా, నీ గురించి ఒక విషయం అర్థమయింది. నువ్వు చదివిన శాస్త్రాలు నీకు సరిగా ఆకళింపు అవలేదు. ఎంత తెలివైనవాడికైనా గురువు అవసరం. నువ్వూ ఒక గురువును ఆశ్రయించు. సంతోషంగా వుండగలవు," అన్నాడు.

మాధవుడికి కోపం వచ్చింది. ఎందుకంటే, సన్యాసి ఈ మాటలన్నప్పుడు అక్కడున్న కొద్ది మంది గ్రామస్థులు హేళనగా నవ్వారు. అందుకని వాడు, "స్వామీ! తమరు చాలా

చెప్పేవన్నీ వున్నాయి. నిజంచెప్పాలంటే ఇంకా ఎక్కువే వున్నాయి. అవి చదవడంవల్ల ఎక్కువ ప్రయోజనమా? మీ మాటలు వినడంవల్ల ఎక్కువ ప్రయోజనమా?" అని అడిగాడు మాధవుడు.

"అవి చదవడం వల్లనే ఎక్కువ ప్రయోజనం," అన్నాడు సన్యాసి.

"నేను అవన్నీ చదివేశాను. బాగా అర్థం చేసుకున్నాను కూడా!" అని మాధవుడు గొప్పగా చెప్పాడు.

"అదృష్టవంతుడివి, నాయనా!" అన్నాడు సన్యాసి.

మాధవుడు ఒక్క క్షణం ఆగి, "అదృష్టం నాదికాదు, మీది. మీకంటే ఎక్కువ తెలిసిన

ప్రాంతాలు సంచరించి వుంటారు. నాకు గురువు కాగల అర్హత వున్నదనిపించే వారిని ఎక్కడైనా చూశారా?" అన్నాడు.

"మేఘనాధుడనే మహాపండితుడున్నాడు. ఆయన గొప్ప కవి కూడా! తన కావ్యాల నాయన స్వయంగా ఊరూరా తిరిగి వినిపిస్తు న్నాడు. తప్పొప్పులు తెలుసుకోవాలన్నదే ఆయన లక్ష్యం. ఇంతవరకూ ఆయన కావ్యంలో తప్పులు చెప్పినవారు లేరు. ఏదో ఒక రోజున ఆయన ఈ ఊరికీ రావచ్చు," అన్నాడు సన్యాసి.

అప్పటినుంచీ మాధవుడు, మేఘనాధుడి రాకకోసం ఎదురుచూడసాగాడు.



ఒక రోజున మేఘనాధుడు భార్యా బిడ్డలతో రంగపురం రానే వచ్చాడు. గ్రామాధికారి తన ఇంట ఆయనకు వసతి కల్పించాడు. ఊరి రచ్చబండవద్ద కావ్య పఠనానికి ఏర్పాట యింది. మేఘనాధుడు తను కొత్తగా రాసిన కావ్యాన్ని గ్రామస్థులకు వినిపించాడు.

అది ఒక సన్యాసి కథ. చదువు సంధ్యలు రాక ఏ పనీ చేయలేక, రాముడనే వాడు సన్యాసుల్లో కలిసిపోతాడు. నిజమైన సన్యాసి అయ్యాక ఏ చదువూ రాకపోయినా వాడు విద్యావంతులందరికంటే గొప్పవాడవుతాడు.

మేఘనాధుడా కావ్యాన్ని చాలా గొప్పగా రాశాడు. అందులోని ప్రతి వాక్యమూ అర్థ వంతంగా వుంది. గ్రామస్థులందరూ మేఘనా ధుడి ప్రతిభను మెచ్చుకోసాగారు. అప్పుడు మాధవుడు లేచి నిలబడి, "మీ కావ్యం వల్ల గొప్ప ప్రమాదముంది. చదువు సంధ్యలు రాకుండా, ఏ పనీ లేకుండా గొప్పవాడవుతా డంటే, ప్రతివాడూ సన్యాసి కావాలనుకుం టాడు. అప్పుడు ప్రజలకు తిండి వుండదు. ఇళ్ళుండవు. చివరకు కట్టుబట్టలు కూడా దొరకవు," అన్నాడు.

దీనికి మేఘనాధుడు చిన్నగా నవ్వి, "మనిషి కూడా జంతువే. సృష్టిలోని ఇతరజంతువులు బట్టలు వేసుకుంటున్నాయా?ఇళ్ళు కట్టుకుం టున్నాయా?పంటలుపండిస్తున్నాయా?అన్నాడు.

"అయితే మనిషి కూడా జంతువులా జీవించాలంటారా?" అన్నాడు మాధవుడు. గ్రామస్థులు నవ్వారు.



కారాన్నీ, కీర్తికాంక్షనూ, స్వార్థాన్నీ విడిచి పెట్ట గలిగితేచాలు. మేము అదేచేస్తున్నాం,"అన్నాడు మేఘనాధుడు.

దానికి మాధవుడు, "అటువంటప్పుడు మీరు కొత్తగా కావ్యాలెందుకు రాస్తున్నారు? కావ్యం రాసిన పేరు మీకే దక్కాలన్న స్వార్థం తోనే కదా! లేకుంటే ఇప్పటికే ఎందరోరాసిన కావ్యాలున్నాయి. వాటి గురించే నలుగురికీ ప్రచారం చేయవచ్చును కదా! అసలు మీ కావ్యాలకు పేరు రావాలన్న కీర్తికాంక్షతోనే కదా ఇలా ఊరూరా తిరుగుతున్నారు," అంటూ ఎదురు ప్రశ్న వేశాడు.

ఇందుకు మేఘనాధుడు ఏ మాత్రం చలించక, "మేము రాసిన కావ్యానికి మా పేరుండకపోతే అది అసత్యమవుతుంది. శ్రీరాముడు మరొక పేరుతో రాజ్యం చేసినా, కాళిదాసు ఇంకో పేరుతో కావ్యం రాసినా ముందు తరాలవారికి అబద్ధం చెప్పినట్లేకదా! చరిత్రకు న్యాయం చేకూర్చాలనే మేము, మా పేరుతో కావ్యరచన చేస్తున్నాం. ఇక ప్రచారమంటావా? మా కావ్యాన్ని ఏ రాజుకో అంకితం చేస్తే లక్ష వరహాలకు తక్కువ కాకుండా ఇచ్చి మాపేరు శాశ్వతం చేయ గలడు. మాకు కీర్తికాంక్ష లేదు కాబట్టి, మేము ఊరూరా తిరిగి ప్రజలకు మా కావ్యా ర్థాన్ని వివరిస్తున్నాం. కీర్తి కోసం కుటుంబ మంతా ఇలా ఊరూరా తిరగడం ఎంతో శ్రమతో కూడిన పని. ఫలమూ తక్కువే! ఇక

మేఘనాధుడు, మాధవుడికేసి ఒకసారి పరీక్షగా చూసి, "మనిషి సంఘజీవి. కావాలన్నా జంతువు కాలేడు. అలాగే సన్యాసీ కాలేడు. కాబట్టి నీ తిండికీ, బట్టకూ, ఇంటికీ సమస్య లేదు," అన్నాడు.

గ్రామస్థులిది విని సంతోషంతో చప్పట్లు కొట్టారు. మాధవుడు చిన్నబుచ్చుకున్నా, ఓటమి నంగీకరించడం ఇష్టంలేక, "మీరు నమ్మిన విషయాన్ని మీరు ఆచరించి చెప్పాలి. మీరు సన్యాసి అయితేనే మీ కావ్యానికి విలువ. కాదంటారా?" అని ప్రశ్నించాడు.

"ఈ విషయమై మేము బాగా ఆలో చించాం.సన్యాసి అంటే ఆలుబిడ్డల్నీ, అయిన వాళ్ళనూ విడిచి పెట్టనవసరం లేదు. అహం

కావ్యాలు కొత్తవి రాయడమెందుకంటావా? సృష్టి అరంభంలో మనిషి బట్టలేకుండా తిరిగేవాడు. తర్వాత ఆకులతో శరీరాన్ని కప్పుకున్నాడు. తర్వాత నారబట్టలు. ఇప్పుడు పత్తితో బట్టలు నేస్తున్నారు. పట్టు బట్టలు కూడా కడుతున్నాం. కాలానుగుణంగా వస్త్ర ధారణలో మార్పు వచ్చినట్లే అభిరుచుల లోనూ, జీవితాన్ని గురించిన అవగాహనలోనూ మార్పులు వస్తాయి.వాటికి తగినట్లుగా కొత్త కావ్యాలూ, కొత్త కవులూ వస్తారు. కొత్త కావ్య మెందుకు రాయాలో తెలుసుకోవాలంటే, నువ్వు కవివి కావాలి. లేదా మా కావ్యాలు చదవాలి.పాత విషయాలను కాలానికి తగ్గట్లు చెప్పడానికీ, కాలానికి తగ్గ కొత్త విషయాలు తెలుసుకునేందుకూ కొత్త కావ్యాలు అన్ని కాలాల్లోనూ రాకతప్పదు," అన్నాడు.

ఈ వివరణకు మాధవుడు దిగ్భ్రాంతి చెందాడు. చాలా విషయాలను ఇన్ని వైపుల నుంచి వాడెన్నడూ ఆలోచించి వుండలేదు. మేఘనాధుడు సామాన్యుడు కాదని వాడికి అనిపించినా, ఆయనను ఇంకా ప్రశ్నించి గ్రామస్థుల ముందు తన గొప్పతనం నిలబెట్టు కోవాలనుకున్నాడు.

మేఘనాధుడు తను చెప్పేదాంట్లో మాటి మాటికీ తనను గురించి – మేము, మేము అంటూ మాట్లాడాడు. నేను అంటే వినయం. మేము అనడం అహంకారం. అంటే, మేఘ నాధుడు అహంకారాన్ని విడిచి పెట్టలేదు!



మాధవుడు అందుకుగాను, "మీలో స్వార్థం, కీర్తికాంక్షా లేవేమో కానీ అహంకారం మాత్రం చెప్పలేనంతగా వుంది,"అని గట్టిగా చెప్పాలను కున్నాడు. కానీ తనబోటి వాడు అలా అంటే మర్యాదగా వుండదు.కాబట్టి తెలివిగా మాట్లాడి మేఘనాధుణ్ణి కాస్త ఆటపట్టించాలను కున్నాడు.

ఇలా అనుకుని మాధవుడు, మేఘనాధు డికి వినయంగా చేతులు జోడించి, "తమరు సామాన్యులు కారు, మహానుభావులు. తమలో స్వార్థంలేదు, కీర్తి కాంక్షలేదు. కానీ మీ కావ్యం గురించి మేము రాశాం, మేము చెప్పాం, అంటూ పదేపదే మేము... మేము... అంటు న్నారు. సామాన్యులది అహంకారంగా భావించే

ప్రమాదముంది. నేను మాత్రం అలా అనుకో వడం లేదు. మీరు ఒకరు కాదు, ఇద్దరో ముగ్గురో అయివుంటారు. అవునా?" అని అడిగాడు.

మేఘనాథుడు ఏమాత్రమూ కోపం తెచ్చుకోకుండా, "అవును, నాయనా! సరస్వతీ ప్రసన్నురాలైన మేఘావతి నా భార్య కావడం ఎంతో అదృష్టం. నా అసలు పేరు రంగనాథుడు. ప్రతి కావ్యాన్నీ మేము కలిసే రాస్తాం కాబట్టి, ఇద్దరి పేర్లూ కలిపి మేఘ, నాథుడు అయింది. కాబట్టి, మేఘనాథుడు ఒకరు కాదు, ఇద్దరు," అన్నాడు.

మాధవుడు ఒక్కక్షణం తెల్లబోయి, "నన్ను క్షమించండి, స్వామీ!"అంటూ చేతులు జోడించాడు.

మేఘనాథుడు చిన్నగా నవ్వి, "ఎన్నడూ ఎదుటి వారిని క్షమించమని అడిగే పరిస్థితి తెచ్చుకోకు. ఆకాశం మీద ఉమ్మి వేయాలనుకుంటే అది నీ ముఖం మీదే పడుతుంది కాబట్టి, అలాంటి పనులు చేయకు," అంటూ హెచ్చరించాడు.

మళ్ళీ మాధవుడు ఊరుకోలేక, "నేను చేసింది తప్పేకానీ మిమ్మల్ని మీరు ఆకాశంతో పోల్చుకోవడం అహంకారం కాదా?" అన్నాడు చటుక్కున.

"నేను ఆకాశాన్ని కాను. అసూయతో, అసహనంతో నన్ను చిన్నబుచ్చాలనుకోవడం వల్ల నువ్వు కుంచించుకుపోయావు. అందువల్ల నేను ఆకాశాన్నయాను తప్ప, నా గొప్పతనమేమీలేదు. ఏ మనిషి అకారణంగా ఎదుటివాణ్ణి చిన్నబుచ్చాలనుకుంటాడో, వాడివల్ల ఎదుటి మనిషి ఆకాశమంతవాడౌతాడు!" అన్నాడు మేఘనాథుడు.

మాధవుడిక మాట్లాడలేక మేఘనాథుడికి సాష్టాంగపడి నమస్కరించి, తనను శిష్యుడిగా స్వీకరించమని కోరాడు. మేఘనాథు డంగీకరించాడు.

ఆయన శిష్యరికంలో మాధవుడి శాస్త్ర పరిజ్ఞానం ఎంతగానో రాణించింది. వాడిలో అహంకారం పూర్తిగా నశించడంతో, జీవితంలో ఎంతో తృప్తిగా ఆనందంగా వుండగలిగాడు.






[మోహనుడు తీసుకుపోయిన భువనసుందరిని మంచిగా తిరిగి తెచ్చుకోవటానికి గ్రీకులు చేసిన యత్నం విఫలమయింది. ట్రోయ్ నగరంపై దాడి వెడలటానికి తనకు సాయం రమ్మని భువనసుందరి భర్త ప్రతాపుడు గ్రీకు రాజకుమారుల నందరినీ కోరాడు. అతి కష్టంమీద గ్రీకుసైన్యాలు నౌకలలో ఆయత్తపరచబడ్డాయి. రూపధరుడు పిచ్చి నటించాడు. వజ్రకాయుడు ఆడవేషంతో ఒక రాజాంతఃపురంలో దాగాడు. అయినప్పటికీ వీరందరితోనూ చేరి గ్రీకు బలాలు ఆయత్తమై కాలక్రమాన ట్రోయ్ తీరాన్ని చేరుకున్నాయి. —తరవాత]

గ్రీకు నౌకలలోనుంచి తీరానికి దూకిన మొదటివాడు చంద్రప్రభుడైతే, రెండవవాడు వజ్రకాయుడు. అతని వెనకనే గ్రీకు బలాలన్నీ దిగి సమరానికి తలపడ్డాయి.

ట్రోజనులలో మరాళుడని ఒక వీరుడున్నాడు. అతను కత్తితోగాని, బల్లెంతోగాని చావడు. ఈ మరాళుడు ఆ తొలిరోజు యుద్ధంలో అనేకవందలమంది గ్రీకు యోధులను యమపురానికి పంపాడు. వజ్రకాయుడు మరాళుణ్ణి ఎదిరించి పోరుసాగించాడు, కాని ఎంతోసేపు పోరినా అతను లొంగలేదు. అఖరుకు మరాళుడు ఒకరాయి తగిలి పడిపోగానే వజ్రకాయుడు అతని రొమ్ము మీద మోకాళ్లు మోపి కూచుని, అతన్ని గొంతు పిసికి చంపేశాడు.

మరాళుడు చావగానే ట్రోజను సేనలు బెదిరి, చెదిరి, వెన్నిచ్చి ట్రోయ్ నగరానికి పారిపోయాయి. ఆ తరవాత గ్రీకులు తమ



నావలను సముద్ర తీరాన ఒక సురక్షిత ప్రాంతాన ఉంచి, ట్రోయ్ నగరపు గోడల బయట ముట్టడివేశారు. ఈ ముట్టడి పదేళ్లు సాగింది. మొదటి తొమ్మిది సంవత్సరాల కాలంలో ఉభయపక్షాలకూ మధ్య చెప్పుకో దగిన యుద్ధం ఏమీ జరగలేదుగాని అనేక ఇతర సంఘటనలు జరిగాయి.

ట్రోయ్ రాజైన వర్ధనుడికి ఇద్దరు భార్యలు. మోహనుడి తల్లి ఆయనకు రెండవ భార్య. ఆయనకుకలిగినయాభైమందికుమారులలో పందొమ్మిదిమంది ఆమె కన్నబిడ్డలే. వారం దరిలోకీ జ్యేష్ఠుడు వీరసింహుడు. ఆమెకు కలిగిన కుమారులలో ఇలియుడు ఒకడు. ఇలియుడికి ఇరవై ఏళ్లు నిండినట్లయితే ట్రోయ్ నగరాన్ని ఎవరూ జయించలేరని దైవజ్ఞులు చెప్పారు.

అందుచేత ఎలాగైనా ఇలియుణ్ణి కడ తేర్చటానికి వజ్రకాయుడు పూనుకున్నాడు. ఒకనాడు ఇలియుడు ఒక ఆలయప్రాంగ ణంలో గుర్రాలను కవాతు చేయిస్తుండగా వజ్రకాయుడు అక్కడికి వెళ్లి, ఇలియుణ్ణి బల్లెంతో పొడిచి చంపేశాడు. ఇలియుడి మృతికి ట్రోయ్ పౌరులందరూ దుఃఖించారు.

వర్ధనుడి కొడుకులలో వృకాక్షుడని మరొక డున్నాడు. వాడు తోటలో కొమ్మలునరికి, రథాలకు పనికివచ్చే కాడి కర్రలు తయారు చేస్తూ ఉండగా, రాత్రివేళ వజ్రకాయుడు రహస్యంగా నగరంలోకి ప్రవేశించి వృకాక్షుడు పనిచేసుకుంటూ ఉండిన తోటకువెళ్లి, అత నినిపట్టుకునితమశిబిరానికితీసుకుపోయాడు.

ఈ ఖైదీని గ్రీకు నాయకులు, ఏం చెయ్యాలో తెలియక, తమ సైన్యాలకు మద్యం సరఫరాచేసే ఒక రాజుకు బానిసగా అమ్మారు. ఆ రాజు కొలువులో ఉండే వారె వరో వృకాక్షుణ్ణిచూసి జాలిపడి, రాజుకు తగిన సొమ్మిచ్చి, అతన్ని బానిసత్వంనుంచి విముక్తుణ్ణిచేశారు. వృకాక్షుడు ట్రోయ్ నగరా నికి తిరిగివస్తూ ఉండగా, దారిలో అతన్ని చూసి వజ్రకాయుడు చంపేశాడు.

వజ్రకాయుడు ఇలాటి పనులింకా చేశాడు. యుద్ధం లేదు, గ్రీకు సైనికులకు పనికూడా లేదు. అందుచేత వజ్రకాయుడు ఒక సైనిక

దళాన్ని వెంటబెట్టుకుని ట్రోయ్ నగరపు పరిసరాలు కొల్లగొట్ట నారంభించాడు. వారు ఐడా పర్వతం మీదికి వెళ్లేసరికి అక్కడ వారికి ప్రశంసనుడు అనేవాడు తటస్థపడ్డాడు.

ఈ ప్రశంసనుడు మోహనుడికి దాయాది. మోహనుడు భువనసుందరిని ఎత్తుకురావటానికి స్పార్టాకు వెళ్లినప్పుడు ప్రశంసనుడుకూడా అతని వెంట వెళ్లి అనేక విధాల సాయపడ్డాడు. అయినప్పటికీ, భువనసుందరి మూలంగా గ్రీకులకూ, ట్రోజనులకూ కలిగిన యుద్ధంలో ప్రశంసనుడు తటస్థంగా ఉండిపోయాడు; అతను యుద్ధం చెయ్యలేదు సరికదా, అతని బలాలుకూడా యుద్ధంలోకి రాలేదు.

ప్రశంసనుడు తన పశువుల మందలను కాసే వారివెంట ఐడా పర్వతం మీద ఉన్న సమయంలో వజ్రకాయుడూ అతని సైనికులూ అక్కడికి వచ్చారు. వజ్రకాయుడి ధాటికి తాళలేక ప్రశంసనుడు కొండ దిగి పారిపోయాడు. గ్రీకులు ప్రశంసనుడి పసుల కాపర్లను హతమార్చి పశువుల మందలను స్వాధీనపరుచుకున్నారు.

ఈ సంఘటన జరిగినాక ప్రశంసనుడు తటస్థంగా ఉండలేక పోయాడు. అతను వెంటనే తన బలాలను ట్రోయ్ నగరానికి తరలించుకు వెళ్లి, యుద్ధంలో చేరాడు. ప్రశంసనుడు గొప్ప యోధుడు, ఎవరినీ లక్ష్య పెట్టని వజ్రకాయుడు సహితం అతన్ని గురించి ఎన్నడూ తేలికగా మాట్లాడలేదు. ఇక ట్రోజను సైనికుల మాట చెప్పనవసరం లేదు. వారు తమ పక్షాన గల వీరులలో వీర





సింహుణ్ణి ఎంతగా గౌరవించేవారో ప్రశంసనుణ్ణి కూడా అంతగానూ గౌరవించేవారు. యుద్ధంలో అతను అనేకసార్లు బాగా గాయపడ్డాడు, కాని ప్రతిసారీ ప్రాణాలతో బయటపడ్డాడు.

ఈ యుద్ధంలో ప్రశంసనుడికి చావు రాసి పెట్టిలేదు. అతని వంశంవాళ్లు ముందు ముందు ట్రోయ్ నగరానికి రాజులు కావాలని రాసిపెట్టి ఉంది.

ట్రోయ్ నగరంతో సఖ్యత గల నగరాలు ఇంకా అనేకం ఉన్నాయి. వాటిలో చాలా వాటిని వజ్రకాయుడు ఓడించి వశపరుచుకున్నాడు. అతనికి లోబడిన నగరాలలో ఒక దానికి రాజు వీరసింహుడికి పిల్లనిచ్చిన మామ. గ్రీకులతో జరిగిన పోరాటంలో ఈ రాజూ, ఆయన కుమారులు ఏడుగురూ మరణించారు.

గ్రీకు శిబిరంలోనే కొన్ని దారుణ సంఘటనలు జరిగాయి. అందులో ఒకటి:

ఒకప్పుడు రారాజు రూపధరుణ్ణి పిలిచి, "నీవు త్రేస్‌కు వెళ్లి నౌకలో ధాన్యం పట్టించుకుని రా!" అని ఆజ్ఞాపించాడు. రూపధరుడు ఆ ప్రకారమే వెళ్లి, ధాన్యం తీసుకురావటానికి మారుగా ఉత్త చేతులతో తిరిగి వచ్చాడు.

గ్రీకు వీరులలో ఒకడైన ప్రబోధుడు రూపధరుడితో, "నీవు వట్టి సోమరిపోతువు! పిరికిపందవు!" అన్నాడు.

"నా తప్పేమీ లేదు. ఎక్కడా ధాన్యం దొరకలేదు. రారాజు నిన్ను పంపిఉన్నా వట్టి చేతులతో వచ్చి ఉండేవాడివే!" అన్నాడు రూపధరుడు.

ప్రబోధుడికి పంతం వచ్చింది. అతను అప్పటికప్పుడే ఒక నావను తరలించుకుని వెళ్లి, దాని నిండా ధాన్యం తీసుకుని తిరిగి వచ్చాడు. రూపధరుడికి తీరని పరాభవం జరిగింది. ప్రబోధుడిపైన ఎలా పగ తీర్చుకోవటమా అని రూపధరుడు అహోరాత్రాలు మథనపడి, చివర కొక పన్నాగం ఆలోచించాడు.

ఒకనాడు రూపధరుడు రారాజుకు ఈ విధంగా వార్త పంపాడు.

"రాత్రి కలలో నాకు దేవతలు కనబడి మన శిబిరంలో ఒక గొప్ప ద్రోహం జరగనున్న దని హెచ్చరించారు. ప్రమాదం తప్పాలంటే ఒక పగలూ, రాత్రీ మనం శిబిరం మార్చాలి!"

రూపధరుడు చేసిన ఈ సూచనను రారాజు వెంటనే అమలు జరిపించాడు. గ్రీకులందరూ తమ శిబిరాన్ని వదిలేసి ఒక పగలూ, రాత్రీ మరొకచోట గడిపారు. శిబిరం ఖాళీ అయిన సమయంలో రూపధరుడు రహస్యంగా ప్రబోధుడి గుడారం ప్రవేశించి అక్కడ ఒక బంగారు నాణాల సంచీని దాచాడు.

తరవాత అతను యుద్ధఖైదీని ఒకణ్ణి పట్టుకుని వాడిచేత బలాత్కారంగా ఒక ఉత్తరం రాయించాడు. ఆ ఉత్తరం వర్ధనుడు ప్రబోధుడికి రాసినట్టుగా ఉన్నది. "గ్రీకులకు ద్రోహం చెయ్యటం నిమిత్తమై నీవు కోరిన ప్రకారం బంగారం పంపడమైనది," అని ఆ ఉత్తరంలో ఉంది.

"నువ్వు వెంటనే ఈ ఉత్తరం తీసుకుపోయి ప్రబోధుడికి అందజెయ్యి!" అని యుద్ధఖైదీకి రూపధరుడు చెప్పాడు. కాని ఖైదీ ఆ ఉత్తరాన్ని ప్రబోధుడికి అందించబోయే దారిలో రూపధరుడు అతన్ని తన మనుషుల చేత చంపించాడు.

మర్నాడు తెల్లవారి గ్రీకులు తమ పాత శిబిరానికి తిరిగివచ్చేటప్పుడు శిబిరం వెలుపల చచ్చిపడి ఉన్న యుద్ధఖైదీ కనిపించాడు.



అతని వద్ద ఉన్న ఉత్తరం వారికి దొరికింది. అది చాలా ప్రమాదకరమైన ఉత్తరంగా కనపడ్డందునదానిని వెంటనేరారాజుకు చేర్చారు.

రారాజు ఆ ఉత్తరాన్ని చూసుకుని ప్రబోధుణ్ణి విచారణకు పిలిచాడు. వర్ధనుడి నుంచి అలాటి ఉత్తరం రావటానికి సంజాయిషీ చెప్పమన్నాడు. తాను దేశద్రోహిని కాననీ, తనకు వర్ధనుడుగాని, మరొకరుగాని ఎన్నడూ బంగారం ఇచ్చి ఉండలేదనీ ప్రబోధుడు చెప్పాడు.

"అతని గుడారం వెతికితే నిజం తెలిసిపోతుంది!" అన్నాడు రూపధరుడు.

గుడారం వెతికారు. బంగారం దొరికింది. ప్రబోధుడు ద్రోహిగా నిర్ణయించబడ్డాడు.

అటువంటి ద్రోహికి శిక్ష ఏమిటంటే సైనికు లందరూ అతన్ని రాళ్లతో కొట్టి చంపటం. ప్రబోధుణ్ణి అదే ప్రకారం గ్రీకులందరూ రాళ్లతో కొట్టి చంపారు. చనిపోయే ముందు ప్రబోధుడు, "అయ్యో! సత్యమా? నా కన్న ముందే నీవు చనిపోయావా?" అని ఆక్రో శించాడు.

ప్రబోధుడి హత్య అన్ని విధాలా అక్రమ మైనది. అతను నిర్దోషి కావటమే గాక గొప్ప ప్రతిభావంతుడు కూడా. ట్రోయ్ నగరాన్ని ముట్టడించిన గ్రీకులకు కాలక్షేపం జరగ టానికి గాను అతను పాచికలు సృష్టించాడు. అతను సృష్టించినవి ఇంకా చాలా ఉన్నాయి. అతను దీపస్తంభాలు కనిపెట్టాడు; త్రాసులూ, కొలమానాలూసృష్టించాడు;లిపిని సృష్టిచేశాడు. సైనిక శిబిరాలలోనూ, ఇతర చోట్లా పహరా వాళ్లను ఏర్పాటు చేసే వైనం కనిపెట్టాడు. గ్రీకులు అతనికి ఎన్నో విధాల ఋణపడి ఉన్నారు.

గ్రీసుదేశంలో ఉన్న ప్రబోధుడి తండ్రికి తన కుమారుడి హత్యను గురించి వార్త తెలిసింది. ఆయన ట్రోయ్ నగరానికి ప్రయాణమై వచ్చి, "నా కొడుకును ఏ కారణం చేత హత్య చేయవలిసివచ్చింది? వాడు ద్రోహి అని ఎలా రుజువు చేశారు?" అని రారాజును నిలదీసి అడిగాడు.

రారాజు ఆయనకు సంజాయిషీ ఇవ్వ నిరాకరించాడు. ప్రబోధుడు అకారణంగా హత్య చేయబడ్డాడనీ, రూపధరుడు అతని మీద కుట్రచేసి ఆ పని చేయించాడనీ రారాజుకు స్పష్టంగా తెలిసే ఉండాలి. అయినప్పటికీ ఆయన రూపధరుడిపైగల ఆదరంకొద్దీ ప్రబోధుడి తండ్రి ఆక్షేపణను తోసిపుచ్చాడు.

తాను వచ్చిన పని కాలేదు. ప్రబోధుడి తండ్రి గ్రీసుకు తిరిగివెళ్లి, కొంతమంది గ్రీకువీరుల భార్యలతో, "నీ భర్త ఎవతెనో ట్రోయ్ నగరపు స్త్రీని పెళ్లాడి వెంటతెస్తున్నాడు. ఇకముందు ఆవిడే రాణి కాబోతుంది!" అని అబద్ధాలు చెప్పాడు. ఇది విని కొందరు గ్రీకు స్త్రీలు బాధతో ఆత్మహత్యలు చేసుకున్నారు. — (ఇంకాఉంది)



# బంగారయ్యపొరబాటు

హేలాపురిలో బంగారయ్య గొప్ప భాగ్యవంతుడు. వ్యాపారం కొడుకుల కప్పగించి,తననాలుగంత స్థుల భవనంలో హాయిగా కాలం గడుపుతున్నాడు.

ఇలా వుండగా, ఒకనాడు బంగారయ్య భవనం రెండో అంతస్థు పిట్టగోడ మీదినుంచి కిందికి పడిపోయాడనీ, కాలు దెబ్బతినడంతో చికిత్స చేయించుకుంటున్నాడనీ, ఆయన మిత్రుడు మాధవయ్యకు తెలిసింది.

మాధవయ్య మిత్రుణ్ణి చూడబోయి, "అంత అజాగ్రత్త ఏమిటి? నాలుగైదడుగుల పిట్టగోడ మీది నుంచి బయటకు పడిపోవడం ఆశ్చర్యంగా వుంది!" అన్నాడు.

"ఏం చెప్పమంటావురా, మాధవా? ఈ జరిగిందానికి నాకు బాధతో పాటు, ఆశ్చర్యం కూడా కలుగుతున్నది. భోజనం కాగానే రాత్రిపూట తాంబూలం వేసుకుని నమిలి పిట్టగోడ మీది నుంచి బయటకు ఊసి, మంచం మీద పడుకోవడం అలవాటు.అయితే,రాత్రి ఏదో ఆలోచిస్తూ మంచం మీద ఊసి, పిట్టగోడ మీది నుంచి అవతలికి దూకేశాను," అన్నాడు బంగారయ్య నొప్పితో మూలుగుతూ.

మిత్రుడు ఏమైనా అనుకుంటాడేమో అన్న ఆలోచన కూడా లేకుండా, మాధవయ్య ఫక్కున నవ్వేశాడు!

— కోనే నాగవెంకటఆంజనేయులు






# మారువేషం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఒక దేశానికి సర్వ స్వతంత్రుడివైన ప్రభువుగా, ప్రజలలో నీ ఆజ్ఞకు తిరుగంటూ వుండదు. అలాంటి నువ్వు కోరిన సౌఖ్యాలన్నీ నిరాటంకంగా అనుభవించవచ్చు. కాని, వాటన్నిటినీ విడిచి, రాత్రివేళ భయంకరమైన ఈ శ్మశానంలో తిరుగాడుతూండడం చూస్తూంటే జాలి కలుగుతున్నది. నిన్ను దుర్లభమైన ఏదో అలౌకిక కార్యసాధనకు పురిగొల్పినవాడు, నీ సుఖసంతోషాలను చూసి ఓర్వలేని వాడై వుండాలి. ఒక్కొక్కసారి అతి సామాన్యులు కూడా ఎదుటివాడి మంచితనాన్నీ, సౌమ్యగుణాన్నీ ఆసరాచేసుకుని, తమ వాక్చాతుర్యంతో పొల్లుమాటలను జీవిత పరమార్థాన్ని చాటుతున్న గొప్ప సుభాషితాలుగా

## బేతాళ కథలు



భ్రమింపచేయగలరు. అనాలోచితంగా నువ్వలాంటి మాయాజాలంలో చిక్కుకున్నావేమో అన్న అనుమానం కలుగుతున్నది. ఇందుకు ఉదాహరణగా, చిత్రసేనుడనే రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

చిత్రసేనుడు మగధ దేశానికి రాజు. ఆయనకు విలాసాలంటే చాలా మక్కువ. రోజంతా నృత్య గీతవాద్యాల మధ్య కులాసాగా గడుపుతూండేవాడు. అందువల్ల పరిపాలన సక్రమంగాలేక ప్రజలు ఇబ్బందులపాలు కాసాగారు.

మహామంత్రి సుబుద్ధి ఒకరోజున రాజు వద్దకు వెళ్ళి, పరిపాలన సక్రమంగా లేదని చెప్పాడు.

చిత్రసేనుడు చిరాకుపడి, "మంత్రులేం చేస్తున్నారు? రాజోద్యోగులేం చేస్తున్నారు?" అన్నాడు.

"తమరు పట్టించుకోకపోతే ఎవరూ ఎవర్నీ లెక్కచేయరు. రాజోద్యోగులేం చేస్తున్నారో తమరు మారువేషంలో గమనించండి," అన్నాడు మహామంత్రి.

ఏకళనున్నాడో ఈమాట రాజుచెవికెక్కింది. ఆయన ఆ రాత్రి మారువేషంలో వెళ్ళి, కొందరు రాజోద్యోగులు అవినీతికి పాల్పడుతున్నట్లు గమనించాడు. మర్నాడు వారిని ప్రశ్నిస్తే వాళ్ళు అమాయకంగా ముఖాలు పెట్టి, "ప్రభూ! కిట్టని వారెవరో మీకు మా మీద లేనిపోనివి కల్పించి చెప్పారు," అంటూ కల్లబొల్లి మాటలు చెప్పబోయారు.

"మీ అవినీతిని నేను స్వయంగా చూశాను. నా మారువేషాన్ని మీరు గుర్తించలేదు," అన్నాడు రాజు. రాజోద్యోగులాయన కాళ్ళ మీద పడి క్షమించమన్నారు. మొదటి తప్పుగా చిత్రసేనుడు వాళ్ళను విడిచిపెట్టాడు.

మారువేషంలో మహారాజు రాజోద్యోగుల్ని గమనిస్తున్నాడని అందరికీ తెలిసిపోయింది. దానితో కొన్నాళ్ళపాటు రాజోద్యోగుల అవినీతి ఆగిపోయింది.

చిత్రసేనుడు మాత్రం ఎప్పటిలాగే ఎక్కువ కాలం విలాసాలలోనే రోజులు గడుపుతున్నాడు. మహామంత్రిహెచ్చరిస్తే, "మారువేషంలో నేను చేయవలసింది చేస్తూనే వున్నాను.

పరిపాలన సక్రమంగా వుండేలా చూడడం మీ బాధ్యత," అని చిత్రసేనుడే ఆయనను మందలించాడు.

రాజోద్యోగుల అవినీతి ఆపినంత మాత్రాన పరిపాలన సక్రమంగా వుండదు కదా! మహారాజు తనకుతానై కలగజేసుకోకపోతే శాసనాలు తగిన విధంగా అమలుకావు. కానీ రాజు తనమాట వినడు! ఇలా ఆలోచించి సుబుద్ధి సమీపారణ్యంలోని జనకసేనుడనే రాజర్షిని రాజధానికి ఆహ్వానించాడు.



జనకసేనుడు శతవృద్ధు. ఆయన మగధ రాజుల వంశానికి చెందినవాడు. ఐహిక సుఖాలమీద వ్యామోహం నశించి వైరాగ్యంతో సమీప అరణ్యానికి వెళ్ళి తపస్సు చేసుకుంటున్నాడు. ఆయన మాట మగధరాజులకు వేదవాక్కు.

చిత్రసేనుడు, జనకసేనుడిని అర్ఘ్యపాద్యాలిచ్చిగౌరవించాడు. జనకసేనుడాయన వినయానికి మెచ్చుకుని, "నాయనా! నువ్వు సర్వ గుణ సంపన్నుడిలా కనబడుతున్నావు. కానీ నీ పాలనలో ప్రజలు సుఖపడుతున్నట్లు తోచదు. ఈ విషయమై ఆలోచించావా?" అని అడిగాడు.

ఈ ప్రశ్నకు చిత్రసేనుడు కలవరపడినా తమాయించుకుని, "నామటుకు నేను మారువేషంలో రాజోద్యోగుల అవినీతిని తెలుసుకుంటూనే వున్నాను.అంతకుమించిఏమిచేయాలో నాకు తోచడంలేదు. నా మంత్రులు, రాజోద్యోగులు, అనుచరులు సమర్థులు కారేమో అని అనుమానంగా వుంది. మీరు వారిని పరీక్షించి తమ అభిప్రాయం చెప్పగలరా?" అన్నాడు వినయంగా.

జనకసేనుడు దీనికి తల అడ్డంగా ఊపి, "ప్రభువులో సమర్థత వుంటే తతిమ్మా వారిలో సమర్థత తప్పక వస్తుంది. నువ్వు మారువేషంలోవున్నప్పుడు ప్రజాక్షేమాన్నే ధ్యేయంగావుంచుకో. రాజోద్యోగుల అవినీతి కంటే ప్రజాక్షేమం ముఖ్యంగా భావించు. ఒక సంవత్సరం తర్వాత మారువేషంలో వున్నప్పుడు హఠాత్తుగా నీకు కనిపిస్తాను. నిన్నెక్కడైనా ఎప్పుడైనా కలుసుకునే అధికారం నాకున్నది కదా!" అన్నాడు.



చిత్రసేనుడు అంగీకార సూచకంగా తల వూపాడు. జనకసేనుడు వెళ్ళిపోయాడు.

అప్పటినుంచి చిత్రసేనుడు వారానికొక్క సారైనా మారువేషంలో ప్రజల మధ్య సంచరించేవాడు. ఆ విధంగా ఆయనకు వాళ్ళ ఇబ్బందులు ఒక్కొక్కటే తెలిసి రాసాగాయి. తన దృష్టిలోకి వచ్చిన ప్రతి ఇబ్బందికీ ఆయన ఎప్పటికప్పుడు పరిష్కారమార్గం సూచిస్తూండేవాడు.

ఇన్ని చేసినా చిత్రసేనుడు తన విలాస జీవితం మాత్రం విడిచిపెట్టలేదు. ప్రతిరోజూ ఎక్కువసేపు నృత్య గీత వాద్యాలతోనే ఆయనకు గడిచేది. ఈ విషయమై మంత్రికూడా ఆయనను హెచ్చరించడం మానేశాడు.

చూస్తుండగానే ఏడాది గడిచిపోయింది. ఒకరోజున చిత్రసేనుడు విలాస మందిరంలో పట్టు పరుపు మీద అలవోకగా పడుకుని, నృత్యగానాలు వింటూ తన్మయత్వంలో మధ్య మధ్య కరతాళ ధ్వనులు చేస్తూండగా చటుక్కున అక్కడికి జనకసేనుడు వచ్చాడు.

చిత్రసేనుడు కలవరపడుతూ లేచి ఆయనను సమీపించి పాదాభివందనం చేశాడు. జనకసేనుడు అసంతృప్తిగా ఆయన వంక చూసి, "ఈ ఏడాదిలోనూ నీ రాజ్యంలో చెప్పుకోతగ్గ మార్పు వచ్చినట్లు లేదు. నేను చెప్పి వెళ్ళినది శ్రద్ధగా పాటించావా?" అన్నాడు.

"నిన్ననే మారువేషంలో ఒక పేదవాడింటికి వెళ్ళాను. వైద్య సదుపాయం లేక వాడు బాధపడుతున్నాడు. వాడికి ఉచిత వైద్యం జరిగే ఏర్పాటు చేశాను," అన్నాడు చిత్రసేనుడు వినయంగా.

"అది సరే! మారువేషంలో వున్నప్పుడు ప్రజా క్షేమం గురించి తప్ప మరే విషయమూ ఆలోచించరాదని చెప్పానుకదా! అది నువ్వు శ్రద్ధగా పాటిస్తున్నట్లు లేదు," అన్నాడు జనకసేనుడు.

ఇందుకు చిత్రసేనుడు చిన్నబుచ్చుకుని, "ఒక సామాన్యుడు జబ్బుతో బాధపడుతూంటే చూడలేక వెంటనే వాడికి ఉచిత వైద్యం ఏర్పాటు చేశాను కదా! అయినా నేను మీ మాటను శ్రద్ధగా పాటించలేదనే అనుకుంటున్నారా?" అన్నాడు.

"ఆ సంగతి నాకు బాగా అర్థమయింది. కానీ నేను నువ్వు మారువేషంలో వున్నప్పటి మాట అడుగుతున్నాను," అన్నాడు జనకసేనుడు.

ఆ ప్రశ్నకు చిత్రసేనుడు ఆశ్చర్యపోతూ, "అప్పుడు నేను మారువేషంలోనే వున్నాను," అన్నాడు.

"మారువేషం అంటే ఏమి వేషం?" అన్నాడు జనకసేనుడు.

"ఒక పేద రైతు వేషం," అని జవాబిచ్చాడు చిత్రసేనుడు.

"పేదరైతు మగధప్రజలలో ఒకడు కాదా? నీ ప్రజల్లో ఒకడిగా వేషం వేసుకుంటే, అది మారువేష మెందుకవుతుంది?" అన్నాడు జనకసేనుడు.

చిత్రసేనుడు కళవెళపడిపోతూ, "నేను పేద రైతు వేషం వేసుకుంటే, అది మారువేషం కాదా? మరయితే, ఈ దేశానికి రాజునైన నేను ఏ వేషం వేస్తే మారువేషమవుతుంది?" అని అడిగాడు.

జనకసేనుడు నవ్వి, "నువ్వు మగధ ప్రజలలో ఒకడివి. నీ ప్రజలలో ఏ వేషం వేసినా అది మారువేషం కాదు. ఈవేళ రైతుగా వున్న వాడు రేపు వ్యాపారి కావచ్చు. అంతమాత్రాన అవి వేషాలు కావు. నువ్వు పేదరైతుగా వేషం వేసుకుని, ఒక పేదవాడు జబ్బుగా వుండడం చూశావు. ఒక సామాన్య పేదరైతుగా ఆలోచించి, వాడి వరకు వైద్య సదుపాయం



చేశావు. అదే రాజైతే మొత్తం పేదవారందరి గురించీ ఆలోచించి, వారందరికీ ఉచిత వైద్య సదుపాయం ఏర్పాటు చేయిస్తాడు. నువ్వు ప్రతి సమస్యనీ ఒక్కొక్కడి గురించే ఆలోచిస్తే, సామాన్యుడివి. దేశంలోని మొత్తం ప్రజలందరి సమస్యల గురించీ ఆలోచిస్తే, అప్పుడే రాజువు! అర్థమయిందా?" అన్నాడు.

చిత్రసేనుడు వెంటనే, "ఇక మీదట ప్రతి సమస్యనూ ప్రజాక్షేమం దృష్టిలో వుంచుకుని పరిష్కరిస్తాను. నాలోపం నాకు తెలిసింది," అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, పరిపాలనా విషయాలు పట్టించుకోక విలాస జీవితం

గడిపే చిత్రసేనుడిలో వచ్చిన మార్పు మెచ్చ దగిందే. కానీ ఇందుకోసం జనకసేనుడు మాట్లాడిన తీరు కేవలం వాక్చాతుర్యమే కాక పరస్పర వైరుధ్యంగా కూడా కనబడుతున్నది. ఏ దేశపు రాజైనా, ఆ దేశపు ప్రజల్లో ఒకడు కాబట్టి, ఆయన ఏవేషం వేసినా అది మారు వేషం కాదనడం అర్థరహితం కాదా? ఈ సూత్రీకరణ ప్రకారం రాజైనవాడు మారువేషం వేయాలంటే – ఏ రాక్షసుడుగానో, దేవతగానో వేషం వేయవలసి వుంటుంది! వీటన్నిటికన్న జనకసేనుడు, చిత్రసేనుడితో — నువ్వు మారు వేషంలో వుండగా కలుసుకుంటాననడం మరింత హాస్యాస్పదంగా వున్నది. ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీతల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఇందులో జనకసేనుడు రాజర్షి అన్న సంగతి గుర్తుంచుకుంటే, ఆయన తన స్థాయికి తగిన విధంగా మాట్లాడాడే తప్ప, అందులో వాక్చాతుర్యం, పరస్పర వైరుధ్యం అంటూ ఏమీ లేదని తెలిసిపోతుంది. ఆయన చిత్రసేనుడికి సూచించింది – ఏ దేశంలోనైనా పౌరులు పలు విధాలుగా వుంటే, వారిలో సమర్థుడు వారికి రాజవుతాడని. అంటే – ఒక పౌరుడు ప్రజాసేవ చేయడానికి వేసుకున్న మారువేషం రాజు. అందుకే జనకసేనుడు, చిత్రసేనుడితో -- నువ్వు మారువేషంలో వుండగా కలుసుకుంటానని చెప్పాడు. అదే విధంగా ఆయన వచ్చినప్పుడు చిత్రసేనుడు నృత్యగానాల్లో లీనమై వున్నాడు. ఇది చూసిన జనకసేనుడు, అతడికి తను చేస్తున్నది మారువేషానికి తగిన పనికాదని హితవు చెప్పాడు. సహజంగా వివేకీ, సూక్ష్మగ్రాహీ అయిన చిత్రసేనుడు వెంటనే సంగతి గ్రహించి – నాలోపం నాకు తెలిసింది, అన్నాడు. ఈ కారణాలవల్ల జనకసేనుడు మాట్లాడిన దాంట్లో వాక్చాతుర్యం, పరస్పర వైరుధ్యం అంటూ ఏమీ లేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)

[ఆధారం : "వసుంధర" రచన]





# తాజా సరుకు

ఒకనాటిసాయంత్రంవేళ రావిపాలెం కరణం కామయ్య, మరికొందరు గ్రామపెద్దలు రచ్చ బండ దగ్గర కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడు తూండగా, పొరుగూరు నుంచి ఒకడు అక్కడికి వచ్చి, కామయ్యకు నమస్కరించాడు ముసి ముసి నవ్వులు నవ్వుతూ. కామయ్య వాణ్ణి గుర్తించాడు. వాడు తన వియ్యంకుడి ఇంట్లో పనిచేసే వీరయ్య అనే నౌకరు.

వాడివాలకంచూసిఏదోశుభవార్త మోసుకు వచ్చాడని గ్రహించిన కామయ్య, "సంగతే మిత్రా? మా వియ్యంకుడు ఏదో శుభవార్త పంపినట్టుందే!" అన్నాడు.

"శుభవార్తే, బాబయ్యా! తమకు మనమడు పుట్టాడు. అయ్యగారు ఈ సంగతి చెప్పమని నన్ను పంపారు," అన్నాడు వీరయ్య.

కామయ్య పట్టలేని ఆనందంతో నౌకరు చేతిలో ఒక రూపాయి పెట్టి, "ఒరే, నువ్వు వెంటనే పోయి ఇంట్లో వున్న పెద్ద బుట్ట ఒకటి తీసుకుని,నాగన్నశెట్టి మిఠాయి దుకా ణానికిరా.నేనక్కడికే వెళుతున్నాను," అన్నాడు.

వంశోద్ధారకుడైన మనమడు పుట్టిన, ఈ ఆనంద సమయంలో తెలిసిన వాళ్ళందరికీ మిఠాయిలు పంచి పెట్టాలన్నది, కామయ్య ఆలోచన. ఆయన వెంటనే బయలుదేరి, నాగన్నశెట్టి మిఠాయి దుకాణానికి వెళ్ళాడు.

శెట్టి, కరణాన్ని అంత దూరాన చూస్తూనే, "రండి, కరణం గారూ! మీరు తరుచు మా దుకాణానికేసి రానేరారు," అన్నాడు చిరునవ్వుతో.

"ఇప్పుడవసరం కలిగింది. రకానికి వంద చొప్పున లడ్లు, మైసూరుపాకులు కావాలి. అంతా తాజా సరుగ్గా వుండాలి. ఉన్నాయా?" అని అడిగాడు కరణం.

"ఉన్నాయి కరణంగారూ! మీరడిగినలడ్లు, మైసూరు పాకులు — రెండూ తాజా సరుకులే. అక్కడ వండడం; ఇక్కడ అమ్మటం, అంతే!" అన్నాడు నాగన్నశెట్టి.

వి. ఉమాదేవి

ఆ తర్వాత మిఠాయి ధరతో సంభాషణ మొదలై, వాటి తయారు వగైరా విషయాల పైకి మళ్ళింది.

కరణం కాస్త ఆశ్చర్యంగా, "అది సరేకాని, శెట్టీ! ఆమైసూరుపాకులు కోటగోడలా అంత ఎత్తున పేర్చావు. ఆ లడ్లు పెద్ద రాశి పోసినట్టు గుండ్రంగాఅమర్చావు. నానాశ్రమాపడివండడం తోపాటు ఈ అమర్చడం మరింత శ్రమకదా!" అన్నాడు.

"శ్రమ అని మెల్లగా అంటారేం, కరణం గారూ! వీటిని వండడానికి పడే శ్రమకంటే, దుకాణంలో కంటికి నదరుగా అమర్చడం రెండింతలుఎక్కువశ్రమఅనుకోండి," అన్నాడు నాగన్నశెట్టి.

"అంతా ఒంటి చేతి మీదుగా లాక్కొస్తు న్నావు!" అన్నాడు కరణం సానుభూతిగా.

"ఏం చేసేది ఖర్మ, కరణంగారూ! ఈ లడ్లూ, మైసూరుపాకులూ అంత పెద్ద మొత్తంలో తయారుచేయడానికి నిండు రెండు రాత్రులు పట్టింది. ఈమైసూరుపాకాన్నిహెచ్చు తగ్గులు లేకుండా,ఒకే ప్రమాణంలోవుండేలా ముక్కలు కోయడానికీ, లడ్లుఅందంగా గుండ్రంగాచుట్ట డానికీ మరొకరాత్రి పట్టింది," అన్నాడు శెట్టి.

"అవును, మొదట్లో గ్రహించలేదుగాని, ఇప్పుడు తెలుస్తూనే వుంది!" అన్నాడు కరణం మిఠాయిలకేసి పరీక్షగా చూస్తూ.

"ఆ రెండు రాత్రులతో నా శ్రమ ముగిసి పోయిందనుకున్నారా, కరణంగారూ! అదంతా ఒక ఎత్తు అయితే, వీటిని ఈ రకంగా అందం గాఅమర్చడానికి మూడు రాత్రులు శ్రమపడ వలసి వచ్చింది," అంటూ నిట్టూర్చాడు శెట్టి.

ఇంతలో అక్కడికి పెద్ద బుట్టతో వచ్చాడు నౌకరు వీరన్న. వాణ్ణి చూస్తూనే శెట్టి మహదా నందంగా, "ఆ బుట్ట ఇలాతే,సరుకు లెక్క పెట్టి అందులో సర్దుతాను," అంటూ చేయి ముందుకు చాచాడు. కరణం కూర్చున్న చోటు నుంచి లేస్తూ, "వద్దులే శెట్టీ! తాజా మిఠాయిలు కొనాలని బయలుదేరాను. వస్తా!" అంటూ అక్కణ్ణించి కదిలాడు.

కరణం కామయ్యతో మాటల్లోపడి, తను అసలు విషయం బయటికి అనేశానని అప్పుడు గ్రహించాడు నాగన్నశెట్టి.



# చందమామ అనుబంధం -75

## మనదేశపు చెట్లు



## రేలచెట్టు

ఒక్క ఆకు కూడా లేకుండా చెట్టు నిండా పసుపు రంగుతో గుత్తులు గుత్తులుగా పూచే అందమైన రేలచెట్టు మనదేశంలోని అందమైన చెట్లలో ముఖ్యమైనది. ఇది యూరపులోని లేబర్నమ్ జాతిదే కాని దీని పువ్వులు అంతకన్నా పెద్దవి (30 - 40 సెం.మీ), అందమైనవి. ఫిబ్రవరి - మార్చ్ నెలల మధ్య ఈ చెట్లు ఆకులు రాలుస్తాయి. ఆ తరవాత చెట్ల కొమ్మలకు పువ్వులు పూస్తాయి. ఏప్రిల్ - మే నెలల మధ్య ఆకులు మళ్ళీ చిగురిస్తాయి.

సాధారణంగా 1,500 మీటర్ల ఎత్తయిన కొండ ప్రాంతాలలో ఈ చెట్లు ఎక్కువగా కనిపిస్తాయి. ఈ చెట్లు 12-15 మీ॥ ఎత్తు మాత్రమే పెరుగుతాయి. బోదెలు కాస్త పొట్టిగానూ, కొమ్మలు నాలుగువైపులా విస్తరించి, కిందికి వంగి గుబురుగా వుంటాయి. ఆకులు ముదురు పచ్చరంగుతో 10-12 సెం.మీ పొడవూ, 4-5 సెం.మీ వెడల్పూ కలిగి రెమ్మకు రెండు వైపులా జతలు జతలుగా వుంటాయి.

వీటి కాయలు 60-100 సెం.మీ॥ పొడవుతో, నల్లగా, ఒక్కొక్క చెట్టుకు దాదాపు వంద వరకు వేలాడుతూ వుంటాయి. కాయ లోపల నిలువుగా 40 నుంచి 100 గదులుగా విభజింపబడి వుంటాయి. ఒక్కొక్క గదిలో చదునైన అండాకారంలో విత్తనాలు వుంటాయి. గదుల పొరలకు తియ్యటి గుజ్జువుంటుంది. ఇది విరోచనాలకు పనికి వచ్చే ఔషధాలు తయారుచేయడానికి ఉపయోగపడుతుంది. ఈ గుజ్జును కోతులు ఇష్టంగా తింటాయి. అందుకే—హిందీలో ఈచెట్టును 'బందర్-లాఠీ' అంటారు.

వృక్షశాస్త్రంలో రేల చెట్టును 'కాసియా ఫిస్టులా' అంటారు. హిందీలోనూ, బెంగాలీలోనూ దీనిని అమల్టాస్ అనీ. మరాఠీలో భావా అనీ, తమిళంలోనూ, మలయాళం లోనూ కొన్నై అనీ అంటారు. కేరళ ప్రాంతంలో ఈ రేల పువ్వులను ఏప్రిల్‌లో వచ్చే 'విషుక్కని' పర్వదినంలో పూజకు ఉపయోగిస్తారు.

ఢిల్లీ, కలకత్తా, బొంబాయి, మద్రాసు వంటి మహానగరాలలో ఈ చెట్లను రోడ్ల కిరువైపులా అలంకారంగా నాటి పెంచుతున్నారు. బొంబాయిలో 'లేబర్నమ్ రోడ్' అన్న పేరుతోనే ఒక రోడ్డు ఉండడం విశేషం!




# అతిప్రాచీన నాటకకర్త

కొన్ని వేల సంవత్సరాలకు పూర్వం రచించబడిన రామాయణ మహాభారతాలు, తరతరాలుగా చదువబడుతూ ఈనాటికీ చదువరులను అలరిస్తున్నవి. అంతేకాదు; రామాయణ, భారత కథల ఆధారంగా వివిధ భారతీయ భాషలలో పలు కావ్యాలు రచింపబడ్డాయి. అనేక నాటకాలు రచింపబడ్డాయి. సంస్కృత భాషలో అతి ప్రాచీన నాటకకర్త అయిన భాసుడు కూడా. రామాయణ, భారత కథల ఆధారంగా చాలా నాటకాలు రచించాడు.

సుప్రసిద్ధ ప్రాచీన నాటకకర్త అయిన భాసుడి జీవిత విశేషాలను గురించిన వివరాలు తెలియడంలేదు. మహాకవి కాళిదాసు భాసుణ్ణి గురించి గౌరవంతో ప్రస్తావించడం వల్ల, కొన్ని శతాబ్దాల నుంచే చరిత్రకారులు, సాహితీవేత్తలు భాసుడికి సమున్నతమైన స్థానం కల్పించారు. మరికొన్ని ప్రాచీన గ్రంథాలు కూడా భాసుణ్ణి గురించీ, ఆయన రచించిన సుప్రసిద్ధ నాటకమైన 'స్వప్న వాసవదత్త'ను గురించీ గొప్పగా కీర్తిస్తున్నాయి. అయితే, ఇటీవలి కాలంలో అంటే, 1912వ సం॥ వరకు ఆ నాటకాన్ని చదివిన వారు లేరు!

1912వ సం॥లో గణపతి శాస్త్రి అనే సుప్రసిద్ధ సంస్కృత పండితుడు కేరళ ప్రాంతంలో కొన్ని తాళపత్ర గ్రంథాలను కనుగొన్నాడు. వాటిలో 'స్వప్నవాసవదత్త'తో పాటు మరి పన్నెండు నాటకాలు బయటపడ్డాయి. రచనా శైలిని బట్టి చూస్తే వాటన్నిటినీ ఒకే రచయిత రచించి ఉండాలని పండితులు, విమర్శకులు అభిప్రాయపడుతున్నారు. 'స్వప్న వాసవదత్త' రచయిత భాసుడు అన్నది జగద్విదితం. కాబట్టి, మిగతా వాటిని కూడా ఆయనే రచించి ఉంటాడని భావిస్తున్నారు!

భాసుడు క్రీ.పూ. 4-5 శతాబ్దాల నాటి వాడని చెబుతారు. ఆ కాలఘట్టంలో మన దేశమంతటా రాజాదరణకు నోచుకున్న భాష సంస్కృతం. అందువల్ల, సంస్కృత నాటకకర్త అయిన భాసుడు ఏ ప్రాంతానికి చెందినవాడో చెప్పడం సాధ్యం కావడం లేదు. భాసుడి నాటకాలు దేశమంతటా ప్రసిద్ధి గాంచాయి. పూర్వం తాళపత్ర గ్రంథాలను దేవాలయాలలో భద్రపరిచేవారు. ఉత్తర భారతదేశంలోని దేవాలయాలు తరచూ దండయాత్రలకు లోనవడం వల్ల, ఆలయాలలోని తాళపత్రాలు కూడా నాశనమై వుంటాయి. భాసుడి నాటక ప్రతులన్నీ అలా కనిపించకుండా

పోయివుంటాయని పండితులు అభిప్రాయ పడుతున్నారు.

ఒక పురాణ కథ ఆధారంగా రచింపబడిన 'స్వప్న వాసవదత్త' నాటక కథ క్లుప్తంగా ఇలా సాగుతుంది :

వత్సదేశ యువరాజు ఉదయనుడు అపూర్వ సౌందర్యవతి అయిన ఉజ్జయినీ రాకుమారి వాసవదత్తను వివాహమాడతాడు. ఆ తరవాత అతడు భోగలాలసుడై, రాచకార్యాలను ఉదాసీన పరచి బాధ్యతను మరచి, సర్వవేళలా వినోదాలలో తేలియాడడం ప్రారంభిస్తాడు. ఆ కారణంగా రాజ్యపరిపాలనా వ్యవహారాలు క్రమంగా కుంటుపడతాయి. అధికారులు కూడా బాధ్యత మరచి ప్రవర్తిస్తారు.

ఈ పరిస్థితిని అవకాశంగా తీసుకుని, శత్రు రాజు హఠాత్తుగా దాడి జరిపి అతడి అర్ధ రాజ్యాన్ని ఆక్రమిస్తాడు!

రాణి వాసవదత్త నుంచి విడదీస్తే తప్ప, రాజు ఉదయనుడు సక్రమ మార్గానికి రాడని మంత్రి గ్రహిస్తాడు. దానికొక పథకం ఆలోచిస్తాడు. దాని ప్రకారం — వాసవదత్త ఏదో పనిమీద వెళ్ళినప్పుడు — అగ్నికి ఆహుతయి పోయిందన్న వదంతి పుట్టిస్తాడు. ఆ వార్త విని హతాశుడైన రాజు ఉదయనుడు కొంత కాలానికి దుఃఖం నుంచి తేరుకుని, తన దృష్టిని రాచకార్యాల మీదికి మళ్ళిస్తాడు. శత్రు రాజు ఆక్రమించిన రాజ్య భాగాన్ని తన స్వాధీనంలోకి తెచ్చుకుంటాడు. పరిపాలనా వ్యవహారాలను సక్రమ మార్గంలో పెడతాడు.

ఉదయనుడు ఒకనాడు నిద్రపోతూండగా వాసవదత్త స్వప్నంలో కనిపిస్తుంది. అతడు కళ్ళు తెరవగానే ఎదుట ఆమె కనిపిస్తుంది. ఒక్క క్షణం అది కలగానే భావిస్తాడతడు. కాని ఆ తరవాత ఆమె తన నిజమైన భార్య అని గ్రహించి పరమానందం చెందుతాడు. తన బాధ్యతను గుర్తు చేయడానికి వివేకి అయిన మంత్రి వేసిన పథకం గురించి తెలుసుకుని ఆనందిస్తాడు.

ఉదయనుడూ, వాసవదత్తా మళ్ళీ ఏకమవుతారు!



# మీకు తెలుసా?

1. ఎవరెస్ట్ శిఖరాన్ని అధిరోహించిన వారెవరు? ఎప్పుడు?
2. క్రీ.శ. ఒకటవ శతాబ్దంలో, మన దేశానికి వచ్చి, చాలా మందిని క్రైస్తవ మతానికి మార్చి, ఇక్కడే ప్రాణాలు కోల్పోయిన వారెవరు?
3. మన దేశంలో సుప్రీంకోర్టు న్యాయమూర్తి పదవిని అలంకరించిన మొట్టమొదటి మహిళ ఎవరు?
4. మన జాతీయ మృగంగా పులిని ఎప్పుడు ప్రకటించారు?
5. 'టైప్‌రైటర్'ను ఎవరు కనుగొన్నారు? ఎప్పుడు?
6. సప్త సముద్రాలు ఏవి?
7. చండీఘడ్‌లో 'రాక్ గార్డెన్'ను ఎవరు నిర్మించారు?
8. 1804వ సం॥లో నెపోలియన్ ఫ్రెంచి చక్రవర్తి అయ్యాడు. ఆదే సంవత్సరం 'రవాణా ప్రపంచం'లో ఒక గొప్ప సంఘటన జరిగింది. అదేమిటి?
9. సంప్రదాయేతర భావాలు గలదని ఔరంగజేబు తన కుమార్తెను ఇరవై ఏళ్ళ పాటు జైలులో బంధించాడు. ఆమె పేరేమిటి?
10. రష్యన్ భాషకు ఏ లిపిని వాడతారు?

ఐక్యరాజ్య సమితి మొట్టమొదటి ప్రధాన కార్యదర్శి (డిసెంబర్ '94 చందమామ) నార్వేకు చెందిన ట్రిగ్వే లీ (1946 నుంచి); ఆ తరవాత స్వీడన్‌కు చెందిన డ్యాగ్ హ్యామర్స్క్ జోల్డ్ (1953); ఆయన అనంతరం బర్మాకు చెందిన యూథాంట్ (1961); ఆ పిమ్మట ఆస్ట్రియాకు చెందిన కర్ట్ వాల్డ్‌హీమ్ (1972); అటుతరవాత పెరూకు చెందిన జేవియర్ పెరెజ్ డీ క్యూలర్ (1982); 1992 నుంచి ఈజిప్టుకు చెందిన బూట్రోస్ ఘాలీ.

## సమాధానాలు

1. ఇండియాకు చెందిన టెన్సింగ్ నార్గే; న్యూజిలాండ్‌కు చెందిన సర్ ఎడ్మండ్ హిల్లరీ. 1953వ సం॥లో.
2. ఏసుక్రీస్తు పన్నెండుమంది శిష్యులలో ఒకడైన సెయింట్ థామస్.
3. కేరళకు చెందిన జస్టిస్ ఫాతిమా బీవీ.
4. 1972వ సం॥లో.
5. అమెరికాకు చెందిన షోల్స్, గిడ్డన్, సోలే. 1867వ సం॥లో.
6. పసిఫిక్ మహాసముద్రం; అట్లాంటిక్ మహాసముద్రం; ఆర్కిటిక్ మహాసముద్రం; దక్షిణ మహాసముద్రం; హిందూ మహాసముద్రం; అరేబియా సముద్రం; బంగాళాఖాతం.
7. నేక్ చంద్.
8. ఆర్. ట్రివితిక్ చేత ఆవిరితో నడిచే రైలు ఇంజను విజయవంతంగా నడపబడింది.
9. జేబునీసా.
10. క్రైలిక్



# అర్థంలేని స్వార్థం

మలయపురిలో రామశర్మ అనే గొప్ప ఆర్థిక శాస్త్రవేత్త వుండేవాడు. రాజు అనేక విషయాల్లో ఆయన సలహాలు పాటించడం వల్ల దేశంలో పేదరికం లేకుండా పోయింది.

ఇంద్రపురి, మలయపురికి పొరుగుదేశం. రాజు ఎన్ని సంస్కరణలు ప్రవేశపెట్టినా, ఆ దేశంలో పేదరికం తొలగిపోకుండా వున్నది. పొరుగు దేశంలో ప్రవేశపెడుతున్న ఆర్థికసంస్కరణలను ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ, ఇంద్రపురి రాజు తన దేశంలో ప్రవేశపెడుతున్నాడు. అయినా ప్రయోజనం శూన్యం.

ఈ విషయం రామశర్మకు తెలిసింది. తన దేశంలో అద్భుత ఫలితాలను సాధించిన సంస్కరణలు, పొరుగు దేశంలో ఏ కారణం వల్ల విఫలమవుతున్నాయో తెలుసుకోవాలన్న కుతూహలంతో ఆయన ఇంద్రపురికి ప్రయాణమయ్యాడు. అక్కడ ఆయన బంధువులు కొందరు స్థిరపడి వుండడం వల్ల, ప్రయాణానికి కారణం కూడా వెతుక్కోనవసరం లేకపోయింది.

ఆ రెండు దేశాలకు మధ్య ఒక అడవి వున్నది. రామశర్మ ఆ అడవిదారిలో ప్రయాణంచేస్తూ మధ్యలో ఒక చెట్టు కింద ఆగి బడలిక తీర్చుకుంటూండగా, హఠాత్తుగా పైనుంచి ఒక దయ్యం కిందకు దూకింది.

రామశర్మ ఆనాటివరకూ దయ్యాన్ని చూసి వుండలేదు. అందువల్ల స్వతహాగా ధైర్యస్థుడయినా ఆయన శరీరం చిన్నగా వణికింది. అది గమనించిన దయ్యం, "అయ్యా! నన్ను చూసి భయపడకండి. నేను ఇంద్రపురికి చెందిన గొప్ప భాగ్యవంతుణ్ణి. ఒక పల్లెటూళ్ళో వుండడం వల్ల నా సంపద గురించి ఎవరికీ తెలియదు. నేను సంపాదించిన డబ్బంతా ఒకచోట రహస్యంగా దాచి వుంచాను. ఆ విషయం నావాళ్ళకు కూడా తెలియదు. కూటికీ గుడ్డకూ లోటు లేకుండా వుండడం

రాయవరపు ఆదినారాయణరావు



వల్ల, నావాళ్ళెవరూ నా ఈ రహస్య సంపద గురించి పట్టించుకోలేదు. ఆ ధనం ఎవరికీ ఉపయోగపడకుండా దాచేసినందుకే నేనిలా దయ్యాన్నయ్యాను. ఆ డబ్బును ప్రయోజన కరమైన దానికి వినియోగిస్తే, నాకీ దయ్యం రూపు పోయి ఉత్తమ లోకాలు ప్రాప్తిస్తాయి. తమరు ప్రముఖ అర్థికశాస్త్ర పండితులు రామశర్మగారని నాకు తెలుసు. నాకీ రూపు పోవడానికి సాయపడండి," అంటూ చేతులు జోడించి నమస్కరించింది.

"దీనికంత ఆలోచన దేనికి? మీ రాజు గారికి ఆ ధనమందేటట్లుగా చేస్తాను. ఆయన ప్రజోపయోగకర కార్యాలు చేస్తాడు," అన్నాడు రామశర్మ.

"మా రాజుకు ప్రజా సంక్షేమం కంటే విలాసాలే ముఖ్యం. నా డబ్బుతో ఆయన విలాసాలు పెరుగుతాయి. ఆ విధంగా నా డబ్బు దుర్వినియోగమైతే నాకీ రూపం పోదు," అన్నది దయ్యం.

"పోనీ – ప్రజలకు మేలు చేసే సేవా సంస్థలెన్నిటినో మీ రాజు నెలకొల్పి వున్నాడు కదా! నీ డబ్బును వారికందజేస్తాను. విషయం రాజుకూ తెలుస్తుంది; డబ్బు ప్రజలకూ ఉప యోగపడుతుంది," అన్నాడు రామశర్మ.

"అయ్యో! మా దేశంలో సేవా సంస్థల గురించి మీకు తెలియదు కాబోలు. వాటి నిండా చెప్పలేనంత అవినీతి. పది లక్షల వరహాలు వాటికిస్తే లక్ష వరహాలు కూడా ప్రజలకు చేరవు," అన్నది దయ్యం.

మనిషి చనిపోయి దయ్యమైనాక కూడా, డబ్బు పరోపకారానికి వినియోగించాలను కోవడం చాలా గొప్ప విశేషంగా భావించాడు రామశర్మ. అలాంటి పౌరులున్న ఇంద్రపురి రాజ్యంలో పేదరికం వుండడానికి వీల్లేదు మరి!

రామశర్మ ఇలా ఆలోచిస్తూనే, "నాకు మా రాజు మీద నమ్మకముంది. మా దేశంలోని సేవా సంస్థల మీదా నమ్మక ముంది. చూస్తే మీ దేశం పరిస్థితులు వేరుగా తోస్తున్నాయి. నువ్వు ఈ విషయంలో మీ దేశంలోని పండి తుల సహాయాన్నికోరలేకపోయావా?" అన్నాడు దయ్యంతో.

"మా దేశంలోని పండితులందరికీ ధనాశ ఎక్కువ. ఎవరిని సాయమడిగినా, ఆ డబ్బును తమకే ఇవ్వమంటారు. వాళ్ళమీద నాకు అంతగా నమ్మకం లేకనే, మీవంటి నిస్వార్థ పరుల కోసం ఎదురుచూస్తున్నాను," అన్నది దయ్యం.

రామశర్మ, దయ్యానికి సాయం చేయడానికి ఒప్పుకున్నాడు. దయ్యం అదృశ్యరూపంలో వెంటరాగా ఇద్దరూ బయలుదేరి ఇంద్రపురి చేరుకున్నారు. దయ్యం సలహాతో రామశర్మ అక్కడ వున్న ధర్మసత్రమొకదాంట్లో బస చేశాడు.



ఆ సత్రం ఆ ఊరి ప్రముఖ వ్యాపారస్థుడు ధనసేనుడు కట్టించాడు. దానధర్మాలకూ, పుణ్యకార్యాలకూ ఆయన తర్వాతనే ఎవరైనా అని చెప్పుకుంటారు.

రామశర్మ, దయ్యానికి ధనసేనుణ్ణి గురించి చెబుతూ, "వీరి తాతలు త్రిపుర దేశానికి చెందిన వారు. నీతి, నిజాయితీలను నమ్ముకుని వ్యాపారం చేయడం వీరి కుటుంబ సంప్రదాయం. అందువల్లనే వీరు అన్ని దేశాలలోనూ వ్యాపారం చేస్తూ రాణిస్తున్నారు. ధనసేనుడి తమ్ముడు గుణసేనుడు మా దేశంలో ఎన్నోసార్లు రాజు చేత, ప్రజల చేత సత్కరించబడ్డాడు. అతడు మా దేశంలో రెండు దేవాలయాలను, ఎనిమిది ధర్మసత్రాలను, నాలుగు ఉచిత వైద్యశాలలను, ఎన్నో పాఠశాలలను నిర్మించి పోషిస్తున్నాడు. ధనసేనుడి గొప్పతనం గురించి కూడా నేను నీకు హామీ ఇవ్వగలను. నీ డబ్బు అతడికివ్వు," అన్నాడు.

"తమరు చెప్పింది న్యాయసమ్మతంగానే వుంది. కానీ అంతులేని ధనాన్ని విదేశీయుడికి కాక స్వదేశీయుడికిస్తే నాకు తృప్తిగా వుంటుంది కదా!" అన్నది దయ్యం.

అంతలో ఒక పేద బ్రాహ్మణుడు రామశర్మ వద్దకు వచ్చి, "అయ్యా! తమరు పరదేశిలా వున్నారు. అందుకే నోరు విడిచి ధైర్యం చేసి అడుగుతున్నాను. నా ఇల్లు కూలిపోయేలా వుంది; నా తల్లి జబ్బుతో వుంది. నా అవసరాలు పూర్తిగా తమరెలాగూ తీర్చలేరు. తమకు తోచినదిచ్చి నన్ను ఆదుకోండి. ఈ



ఊళ్ళో నలభై సంవత్సరాలుగా వుంటున్నా, ఒక్కరంటే ఒక్కరు నాకొక రాగి పైస ఇచ్చి ఆదుకోలేదు, మా దేశీయులు స్వార్థపరులు," అన్నాడు.

రామశర్మ ఆ బ్రాహ్మణుడికొక వరహా ఇచ్చి, "నీ అవసరానికి సాయపడని వారి నందరినీ స్వార్థపరులనడం మంచిది కాదు. పరదేశీయుల ముందు నీ దేశీయుల్ని చిన్న బుచ్చడం, నిన్ను నీవు చిన్నబుచ్చుకున్నట్టే. ఈ రెండు విషయాలూ గుర్తుంచుకుంటే, నీ కష్టాలన్నీ తీరడానికి ఎంతో కాలం పట్టదు," అని హితబోధ చేసి పంపాడు.

తర్వాత ఆయన, ఆ పేద బ్రాహ్మణుడికి ధనం ఇవ్వడం బావుంటుందని దయ్యానికి చెప్పాడు. అందుకు దయ్యం, "ఆ బ్రాహ్మ ణుడు అవసరంలో వున్న మాట నిజమే. కానీ, ఇంతవరకూ వచ్చి నా డబ్బును ఈ ఊరివాడి కెందుకివ్వాలి? మా ఊరివాడికిస్తేనే నాకు తృప్తిగా వుంటుంది," అన్నది.

సత్రంలో కొంతసేపు విశ్రాంతి తీసుకున్నాక, అదృశ్యరూపంలో దయ్యం వెంటరాగా, ఊళ్ళోకి బయల్దేరాడు రామశర్మ. దారిలో వాళ్ళకు రాజభటుడొకడు ఎదురయ్యాడు. రామశర్మ వాడిని పలకరించి, వాడు చాలా కష్టాల్లో వున్నాడనీ, దయ్యం గ్రామానికి చెందిన వాడనీ తెలుసుకున్నాడు.

"మా ఊరివాడు దొరికితే, మా వీధివాడు దొరకడా?" అన్నది దయ్యం నమ్మకంగా.

అప్పటికి రామశర్మకు దయ్యం ఉద్దేశ్యం పూర్తిగా అర్థమయింది. ఆయన వెంటనే, "మీ వీధివాడి కంటే మీ ఇంటి వాడికిస్తే నీకు మరింత తృప్తిగా వుంటుంది. పద మీ ఊరు వెళదాం," అన్నాడు.

ఇద్దరూ దయ్యంఊరు చేరుకుని, చని పోయిన భాగ్యవంతుడి ఇంటికి వెళ్ళారు. ఇంటిలోపల చాలా హడావుడిగా వుంది.

ఇది చూసి దయ్యం, "అన్నట్లు గుర్తుకు వచ్చింది, ఈ రోజు నా పుట్టినరోజు. నేను బ్రతికున్న రోజుల్లో, మా ఇంట్లో గొప్ప వేడు కలు జరిగేవా రోజు. నా భార్యాబిడ్డలు నా మెడలో పూలమాలలు వేసి సత్కరించేవారు. నాకోసం గాయకులను పిలిపించి, చక్కని

పాటలు పాడించేవారు," అంటూ ఉత్సాహంగా చెప్పుకుపోతూంటే, రామశర్మ ఆ ఇంట్లో ప్రవేశించి, "చనిపోయిన ఈ ఇంటి యజమాని పుట్టిన రోజు వేడుకనింత ఘనంగా చేస్తున్న మీరందరూ ధన్యులు," అన్నాడు.

ఒక విధవరాలు, ఇద్దరు కొడుకులు, కోడళ్లు అంతా మాటలు మాని రామశర్మ వంక ఆశ్చర్యంగా చూడసాగారు. ఒకటి, రెండు క్షణాలు తర్వాత ఆయనన్న మాటలకు అర్థం తెలిశాక, విధవరాలు, "అయ్యో! ఆయన సంగతి మాకు గుర్తు లేదు. బ్రతికున్నంత కాలం క్రమశిక్షణ, క్రమశిక్షణ అంటూ మాకే సరదాలూ లేకుండా చేశాడాయన. ఆయన చావు మా సుఖానికొచ్చింది. ఇరవై ఎకరాల మాగాణి వుంది; కౌలుకిచ్చాం. ఆ వచ్చే డబ్బుతో కనీసం వారానికొక రోజయినా ఇంత సరదాగా జీవిస్తున్నాం," అన్నది.

"అయితే మీరెప్పుడూ ఒక్కసారి కూడా ఆయన్ను తలుచుకోరా?" అని అడిగాడు రామశర్మ.

"ఎందుకు తలుచుకోము? ఆ పోయేదేదో ఇంకాస్త ముందు పోయి వుంటే, మరిన్ని రోజులు సుఖంగా వుండేవాళ్ళం కదా అనిపించినప్పుడల్లా ఆయన్ను తలుచుకున్నట్లే కదా? ఆ తర్వాత, ఊళ్ళో బికారిలా తిరిగే నా సవతి కొడుకున్నాడు. వాడు తాగి తందనాలాడి ఎవరినో ఏదో చేస్తాడు. వాళ్ళు మా ఇంటికొచ్చి ఫిర్యాదు! ఆయన పోగానే వాడికీ ఈ ఇంటికీ సంబంధం తెగిపోయిందని





ఎంత చెప్పినా, ఈ ఫిర్యాదులు తప్పవు. అలాంటప్పుడు ఆయన్ను తలుచుకుని తిట్టుకుంటాం. పోయిన మనిషిని తలుచుకుని ఏం లాభమని మీకు తెలుసు. అయినా పరిస్థితి అలాంటిది!" అన్నది విధవరాలు ఎంతో చిరాగ్గా.

దయ్యం అక్కడొక క్షణముండడానిక్కూడా ఇష్టపడక చెవిలో పోరుతుంటే, రామశర్మ అక్కణ్ణించి బయటపడ్డాడు.

"నేను రెండో పెళ్ళి చేసుకుని నా పెద్ద కొడుక్కెంత అన్యాయం చేశానో, నాకిప్పుడర్థమవుతున్నది. వెంటనే వాణ్ణి కలుసుకుని మాట్లాడండి. నా నిధి గురించి చెప్పండి," అన్నది దయ్యం, రామశర్మతో.

రామశర్మ వారినీ వీరినీ అడిగి చూడగా, ఒక వృద్ధుడు, "వాడా! ఉత్త పనికిమాలిన వెధవ. సవతి తల్లి తిన్నగా చూడకపోతే, ఊళ్ళోవాళ్ళం సాయం చేస్తామన్నాం. కష్టపడి బ్రతకరా అని చిలక్కి చెప్పినట్లు చెప్పాం. బుద్ధిగా వుంటే ఆస్తిలో కూడా వాటా ఇప్పిస్తామన్నాం. కానీ తండ్రి పోగానే మనసు పాడయిపోయిందని వంకపెట్టి తాగుడు కూడా మొదలుపెట్టాడు. ఆ కనబడే తాటి తోపులో తప్పతాగి పడుంటాడు," అని చెప్పాడు.

రామశర్మ వాడిని కలుసుకుని స్పృహ తెప్పించి, వాడి దుస్థితికి కారణమడిగితే వాడు, తండ్రినీ, తల్లినీ, తమ్ముళ్ళనూ, ఊళ్ళోవాళ్ళనూ ఆఖరుకు దేవుణ్ణీ నానా తిట్లూ తిట్టాడు.

రామశర్మ వాడిని అడ్డుకుని, "నీ తండ్రి బోలెడు డబ్బు సంపాదించి ఒకచోట పాతిపెట్టాడు. ఆ రహస్యం నీకు ఇప్పుడు చెబుతాను. ఆ డబ్బుతో నువ్వేం చేస్తావు?" అని అడిగాడు.

దానికి వాడు మత్తుకొద్దీ కళ్ళు మూస్తూ, తెరుస్తూ, "పెద్ద ఇల్లు కొంటాను. దాసదాసీలను పనికి కుదురుస్తాను. ఇష్టం వచ్చినట్లు తింటూ, తాగుతూ కులాసాగా రోజులు గడుపుతాను. లోగడ నన్ను చిన్నచూపు చూసిన వాళ్ళందరి మీదా పగ తీర్చుకుంటాను. మా నాన్న చిత్రపటానికి పూలమాలలు

వేసి రోజూ క్రమం తప్పకుండా పూజ చేస్తాను," అన్నాడు.

వాడు మాటలు ముగించగానే దయ్యం, "అయ్యా! వీడు వారసుడు. వీడికి డబ్బు చేరితే నాకెంతో తృప్తిగా వుంటుంది. అందుకు తమరి అనుమతి కావాలి. తమరనుమతించక పోతే నాకు తృప్తి వుండదు," అన్నది.

రామశర్మ వెంటనే అందుకు అనుమతించి, దయ్యం చెప్పిన సమాచారాన్ని దాని పెద్ద కొడుక్కు అందజేశాడు. ఆ మరుక్షణం దయ్యం మాయమయింది. రామశర్మ తన దేశానికి తిరిగి వెళ్ళాడు.

ఆయన ద్వారా జరిగినదంతా విన్న భార్య, "మీరు వెళ్ళిన పనేమిటి? చేసినదేమిటి? ఏ ప్రయోజనమూ లేకుండా ఇంద్రపురికి ఎందుకు వెళ్ళి వచ్చినట్లు? అనర్హుడికి డబ్బిచ్చిన దయ్యానికి ఉత్తమలోకాలెలా ప్రాప్తించాయి? ఇదంతా నాకు తికమకగా వుంది," అన్నది.

దానికి రామశర్మ నవ్వి, "ఇంద్రపురి రాజు విలాస పురుషుడు. అక్కడి ప్రభుత్వ సంస్థల్లో అవినీతి వుంది. ప్రజలకు రాజు మీదా, ప్రభుత్వ సంస్థల మీదా నమ్మకం లేదు. నా ఊరు, నా వీధి, నా ఇల్లు అంటూ చచ్చేదాకానే కాదు, ప్రాణం పోయాక కూడా అనుకునే రకం మనుషుల డబ్బు, అవసరంలో వున్న వారికుపయోగపడక అనర్హుల చేతిలో వృథా అవుతున్నది. తీరని కోరికలున్న మనుషులు చచ్చి దయ్యాలవుతాయంటారు. అర్థం లేని స్వార్థంతో తను దాచిన డబ్బును అనర్హుడైన కొడుక్కు, నాద్వారా అందజేసి తృప్తి చెందడంతో దయ్యానికి ఆ రూపు పోయింది," అన్నాడు.

అయితే, ఈ జరిగినదంతా ఆ భార్యాభర్తల మధ్యనే వుండిపోలేదు. క్రమంగా అది చాలా మందికి తెలిసి కొంత కాలానికి ఇంద్రపురిని చేరుకుంది. అక్కడ ఇంద్రపురి రాజూ, పౌరులూ కూడా తమ రాజ్య దుస్థితికి మూలకారణం గ్రహించి సిగ్గుపడ్డారు. కొంత కాలానికి ఆ రాజ్యంలోనూ మలయపురిలాగా క్రమంగా మంచి మార్పు వచ్చి ప్రజలు సుఖపడ్డారు.



# చందమామ కబుర్లు



## స్కిప్పింగ్‌లో రికార్డు!

నవంబర్ 21వ తేదీ మద్రాసుకు చెందిన డా॥ జి. రాంప్రసాద్ అనే 22 ఏళ్ళ హౌస్ సర్జన్ ఐదు గంటలలో 40,181 సార్లు స్కిప్పింగ్ చేసి 'గిన్నిస్ బుక్'లో స్థానం సంపాయించడానికి ప్రయత్నించాడు. ఇలా చేసేవారు మామూలుగా గంటకొకసారి 5 నిమిషాలు విశ్రాంతి తీసుకోవచ్చు. కాని రాంప్రసాద్ 20 సెకనులు మాత్రమే ఆగాడు. రెండేళ్ళ క్రితం అతడు ఒక గంటలో 3,590 గుంజీళ్ళు తీసి దానిని గిన్నిస్ బుక్ వారికి తెలియజేశాడుగాని, ఆలోగానే ఆ సంవత్సరం పుస్తకం వెలువడింది. కాబట్టి ఈ సంవత్సరం జాగ్రత్తగా ముందుగానే ఈ విషయాన్ని ఆధారంతో ప్రచురణకర్తలకు తెలియజేశాడు. డా॥ రాంప్రసాద్ ఒక గంటలో 8,556 స్కిప్స్ తీసిన విషయం లోగడే 'లింకా' వాళ్ళు ప్రచురించారు. డా॥ రాంప్రసాద్ పిల్లల వైద్యం పట్ల ప్రత్యేకమైన శ్రద్ధ కనబరుస్తున్నారన్న విషయం ఇక్కడ చెప్పుకోతగ్గ విశేషం!



## రికార్డు కోసం ప్రయత్నం!

కోయంబత్తూరుకు చెందిన ఎమ్. పార్థసారథి అనే డ్రిల్లు మేష్టారు త్వరలో మరొక రికార్డు సృష్టించనున్నాడు. అతడు గంటకు 5 నిమిషాలు విశ్రాంతి తీసుకుంటూ 9 గంటలలో 8,500పల్లటీలు కొట్టగలడు. అందుకు అతనికి 16 కి.మీ. రోడ్డు కావాలి. రోడ్డులో అంతరాయం లేకుండా చూడడానికి అధికారుల సహాయంకావాలి. మంచి క్రీడాకారుడూ, కరాటేలో బ్లాక్ బెల్ట్ సంపాదించిన వాడూ అయిన పార్థసారథి ఇందు కోసం ఒక సంవత్సరంగా అభ్యాసం చేస్తున్నాడు.ప్రస్తుతం ఈ విభాగంలో అమెరికాకు చెందిన యాష్రిటా ఫర్మన్ పదిన్నర గంటలలో 8,341 పల్లటీలు కొట్టి రికార్డు స్థాపించి వున్నాడు!

## పదకొండేళ్ళ నడక!



స్కాట్‌లాండ్‌కు చెందిన ఫియోనా కాంప్‌బెల్ ఇప్పటి వయసు 27 సంవత్సరాలు. బ్రిటన్ ఉత్తరాగ్రంలోని జాన్ ఓ గ్రోట్స్ అనే తన స్వగ్రామం నుంచి ఆమె 16వ యేట బయలుదేరింది. 1,363 కి.మీ. కాలి నడకనే వెళ్ళి అవతలి చివరను చేరుకోవాలన్నది ఆమె ఆశయం. తీరా అక్కడికి చేరాక వెనుదిరగకుండా తననడకను కొనసాగించి,ఐదు ఖండాలగుండా పదకొండేళ్ళు31,338 కి.మీ. దూరం నడిచి,గత అక్టోబర్ 14వతేదీ బయలుదేరిన స్వస్థలానికి చేరుకున్నది. ఆమె ఆస్ట్రేలియాలో సిడ్నీ నుంచి పెర్తకు; అమెరికాలో న్యూయార్క్ నుంచి లాస్ ఏంజెల్స్‌కూ నడిచింది. ఆఫ్రికా ఖండం ఒక చివరి నుంచి మరొక చివరకు చేరుకోవడానికి ఆమెకు రెండేళ్ళు పట్టింది. మునుముందు వెళితే ఒంటరిగా కాకుండా ఎవరినైనా తోడు తీసుకుని వెళతానంటున్నదామె!




హస్తినాపురానికి సమీపంలో ఉండే అరణ్యాలలో హిరణ్యధన్వుడు అనే ఎరుకల రాజు ఒకడుండేవాడు. ఆయనకు ఏకలవ్యుడనే కొడుకున్నాడు. ద్రోణుడనే ఆయన వద్ద దేశంలోని రాజకుమారులందరూ విలువిద్య నేర్చుకుంటున్నారనీ, ఎక్కడెక్కడి నుంచో రాజకుమారులు హస్తినాపురానికి వచ్చి ద్రోణుడికి శిష్యులై సమస్త అస్త్ర శస్త్ర విద్యలూ అభ్యసిస్తున్నారనీ ఏకలవ్యుడు విన్నాడు.

అతను ద్రోణుడి వద్దకు వచ్చి, తనను కూడా ఒక శిష్యుడుగా చేర్చుకోమన్నాడు. వాడు ఎరుకలవాడని తెలిసి, ద్రోణుడు అతన్ని శిష్యుడుగా చేర్చుకొనడానికి నిరాకరించాడు.

ఏకలవ్యుడు ఎంతో వినయంతో ద్రోణుడికి మొక్కి సెలవు పుచ్చుకుని, తన అరణ్యానికి తిరిగివెళ్ళి, ఒకచోట ద్రోణుడి బొమ్మ ఒకటి చేసిపెట్టి, ఆయన్నే గురువుగా భావించి, బాణాలు ప్రయోగించడం అభ్యాసం చేయసాగాడు. ఆ అభ్యాసం ఫలితంగా ఏకలవ్యుడు విలువిద్యలో ద్రోణుడి శిష్యులందరినీ మించిపోయాడు.

ఒకనాడు ద్రోణుడి శిష్యులు వేటాడటానికి ఏకలవ్యుడుండే వనానికే వచ్చారు. వేటకుక్కలలో ఒకటి మిగిలిన కుక్కల నుంచి వేరై, జింక తోలు కట్టుకుని, మట్టి కొట్టుకుని, జుట్టంతా జడలు కట్టుకుపోయి ఉన్న ఏకలవ్యుణ్ణి చూసి మొరిగింది. ఏకలవ్యుడు కుక్క చేసిన ధ్వనిని బట్టి ఒకేసారి ఏడు బాణాలు వేసేసరికి, ఆ ఏడు బాణాలూ కుక్క ముఖంలో గుచ్చుకున్నాయి. అలా గుచ్చుకున్న

8. ఏకలవ్యుడు



బాణాల తోనే ఆ కుక్క మరింత గట్టిగా మొరుగుతూ, రాజకుమారుల వద్దకు తిరిగి వచ్చేసింది.

వాళ్ళు కుక్క ముఖంలో నాటిన బాణాలు చూసి, వాటిని వేసినవాడు చాలా గొప్ప విలుకాడై ఉండాలని గ్రహించి అతన్ని వెతుక్కుంటూ అరణ్యంలోకి బయలుదేరారు. చివరకు వాళ్ళకు ఏకలవ్యుడు కనబడ్డాడు గాని వాళ్ళు అతన్ని గుర్తించక, "ఎవరు నువ్వు? మీ తండ్రి ఎవరు? నీకు గురువెవరు?" అని అడిగారు.

ఏకలవ్యుడు వారితో, "నేను ఎరుకల రాజు కొడుకును. నా పేరు ఏకలవ్యుడు. నేను ద్రోణాచార్యుల వారిని నా గురువుగా భావించి విలువిద్యాభ్యాసం చేస్తున్నాను," అని చెప్పాడు.

రాజకుమారులు హస్తినాపురానికి తిరిగి వచ్చి, ఏకలవ్యుడి సంగతి ద్రోణుడికి చెప్పారు. ఏకలవ్యుడు తనకన్న విలువిద్యలో గొప్పవాడై ఉంటాడని అర్జునుడికి బెంగ పట్టుకున్నది. అతను ద్రోణుడితో, "నాకన్న గొప్ప విలుకాడు లోకంలో మరొకడు ఉండటానికి వీలు లేకుండా నాకు శిక్షణ ఇస్తామన్నారు. కాని ఈ ఏకలవ్యుడికి నాకన్న హెచ్చు విలువిద్య నేర్పినట్టున్నారే?" అన్నాడు.

అర్జునుడీ మాట అన్న మీదట ద్రోణుడు మిగిలిన శిష్యుల కెవరికీ తెలియకుండా అర్జునుణ్ణి మాత్రం వెంటబెట్టుకుని, అరణ్యంలో ఏకలవ్యుడుండే చోటికి వెళ్ళాడు.

విలువిద్యాభ్యాసంలో మునిగి ఉన్న ఏకలవ్యుడు ద్రోణాచార్యుడికి ఎదురువచ్చి నమస్కరించి, కూర్చోబెట్టి అతిథి మర్యాదలు చేసి, ఎదురుగా నిలబడి, "నేను తమ శిష్యుణ్ణి!" అన్నాడు.

"నువ్వు నా శిష్యుడవే అయితే గురుదక్షిణ ఏమిచ్చుకుంటావు?" అని ద్రోణుడు ఏకలవ్యుణ్ణి అడిగాడు.

"గురుదక్షిణగా ఇవ్వరానిదంటూ ఏముంటుంది? నా ఈ శరీరమంతా తమదే," అన్నాడు ఏకలవ్యుడు.

"అలా అయితే నీ కుడి బొటనవేలు కోసి నాకుగురుదక్షిణగాఇయ్యి,"అన్నాడుద్రోణుడు.

ఏకలవ్యుడు ఏమాత్రం సంకోచించక తక్షణమే తన కుడి బొటనవేలు నరికి ద్రోణుడికిచ్చాడు.

అటుతరవాత అతను విల్లును ఎడమచేత పట్టుకుని, కుడిచేతి మిగిలిన వేళ్ళతో బాణాలు సంధించటం అభ్యాసం చేశాడు. కాని అతను విలువిద్యలో మొదట ఉండిన ప్రావీణ్యాన్ని పోగొట్టుకున్నాడు.

ఈవిధంగా అర్జునుడి భయాన్ని తీర్చి, ద్రోణుడు కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ అతనితో సహా హస్తినాపురానికి తిరిగి వచ్చాడు.

ద్రోణుడి దగ్గిర అన్ని విద్యలూ నేర్చుకున్నప్పటికీ కూడా పాండవులు వేరువేరు విద్యలలో ప్రవీణులయ్యారు. ధర్మరాజు రథికుడుగా గొప్ప ప్రావీణ్యం సంపాదించాడు. గదా యుద్ధంలో భీముడూ, దుర్యోధనుడూ బాగా రాణించారు. అర్జునుడు విలువిద్యలో సాటిలేనివాడయ్యాడు; ఈ విద్యలో అతని బుద్ధిబలమూ, శరసంధానంలో వేగమూ, శస్త్రాస్త్రప్రయోగ నైపుణ్యమూ మరెవరికీ రాలేదు.

అశ్వత్థామకు తెలిసిన యుద్ధ రహస్యాలు మరెవరికీ తెలియవు.

నకులసహదేవులుకత్తియుద్ధంలోహెచ్చుగా రాణించారు.

భీముడి గదాయుద్ధ కౌశలమూ, అర్జునుడి విలువిద్యాతిశయమూ చూసి దుర్యోధనుడు మొదలైనవాళ్ళు చాలా బాధపడుతుండేవారు.



ఒకనాడు ద్రోణుడు తన శిష్యులలో ఎవరికెంత గురి ఉన్నదీ తెలుసుకోగోరి, ఒక బొమ్మ గద్దను చేయించి, దానిని కనపడీ కనపడకుండా ఒక చెట్టు మీద పెట్టించి, శిష్యులందరినీ చెట్టు వద్దకు తీసుకుపోయి, "ఈ చెట్టు మీద ఉన్న పక్షి, ఆకుల సందుగా జాగ్రత్తగా చూస్తే కనబడుతుంది. మీరందరూ విళ్ళకు బాణాలు సంధించి, నేను చెప్పగానే దాని తల తెగేటట్టు కొట్టాలి," అన్నాడు.

ఈ పరీక్షలో మొట్టమొదటి వంతు ధర్మరాజుది.

"బాగా చూడు, పక్షి కనిపిస్తున్నదా?" అని ద్రోణుడు అడిగాడు. "కనిపిస్తున్నది," అన్నాడు ధర్మరాజు.

"పక్షితో బాటు నీకు నేనూ, మిగిలిన వాళ్ళూ కూడా కనిపిస్తున్నామా?" అని ద్రోణుడు మళ్ళీ అడిగాడు.

"మీరందరూ కనిపిస్తున్నారు," అన్నాడు ధర్మరాజు.

"నీ దృష్టి గురిపైన లేదు. నువ్వు ఆ పక్షి తల తెగవెయ్య లేవు, వెళ్ళు," అన్నాడు ద్రోణుడు.

ఆయన మిగిలినవారిని ఒక్కొక్కరినీ ఇదే విధంగా ప్రశ్నించాడు. అందరూ ధర్మరాజులాగే జవాబు చెప్పారు.

చివరకు అర్జునుడు వచ్చి పక్షి కేసి చూశాడు. మిగిలినవాళ్ళంతా కనిపిస్తున్నారా అని ద్రోణుడడిగితే, తనకు పక్షి తప్ప ఇంకేమీ కనబడటం లేదన్నాడు.

"బాణం వదులు," అన్నాడు ద్రోణుడు. మరుక్షణం బొమ్మ పక్షి తల తెగి కింద పడింది. ద్రోణుడు అమితానందంతో అర్జునుణ్ణి మెచ్చుకుని, ద్రుపదుణ్ణి యుద్ధంలో గెలవగలవాడు అర్జునుడేనని మనసులో అనుకున్నాడు.

ఒకనాడు ద్రోణుడు తన శిష్యులనందరినీ వెంటబెట్టుకుని యమునకు స్నానానికి వెళ్ళాడు. ద్రోణుడు నదిలో స్నానం చేస్తూ ఉండగా ఒక మొసలి ఆయన తొడను పట్టుకున్నది. మొసలిని బాణాలతో కొట్టమని ఆయన తన శిష్యులకు కేక పెట్టాడు. అందరూ బాణాలు వేశారు గాని ఒక్కరి బాణమూ మొసలికి గురిగా తగలలేదు. బాణాలు ఆయనకు తగులుతాయని వాళ్ళు



భయపడ్డారు. ఒక్క అర్జునుడు మాత్రం అయిదు బాణాలు, గురువుగారి తొడకు తగలకుండా మొసలికే తగిలేటట్టు వేసి, మొసలిని చంపేశాడు.

ద్రోణుడు అర్జునుణ్ణి మెచ్చుకుంటూ, "అర్జునా, నీ నేర్పు చాలా గొప్పది. నీకు బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని మంత్రసహితంగా ఉపదేశిస్తాను.దానిని మానవాతీతుడిపై ఉపయోగించవలసిందే గాని సామాన్యుడిపైప్రయోగిస్తే లోకాలు దగ్ధమైపోతాయి," అన్నాడు.

అర్జునుడు అప్పటికప్పుడే స్నానం చేసి, శుచి అయి, ఆ బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని ద్రోణుడి నుంచి ఉపదేశం పొందాడు.

ఒకనాడు ద్రోణుడు ధృతరాష్ట్రుడి సభకు వెళ్ళాడు. అక్కడ వ్యాసుడూ, భీష్ముడూ, విదురుడూ, కృపుడూ, బాహ్లికుడూ, సోమదత్తుడూ మొదలైన పెద్దలందరూ ఆసీనులై ఉన్నారు.

ద్రోణుడు ధృతరాష్ట్రుడితో, "మహారాజా, కుమారులందరూ ఇంత కాలంగా నావద్ద విలువిద్య నేర్చుకున్నారు. వారి ప్రావీణ్యం పరీక్షించండి," అన్నాడు.

ధృతరాష్ట్రుడు ద్రోణుడితో, "మీరు మాకు మహోపకారం చేశారు. పిల్లవాళ్ళ విద్యా ప్రదర్శనం ఎక్కడ జరిగేదీ, ఎప్పుడు జరిగేదీ మీరే నిర్ణయించండి. మిగిలిన ఏర్పాట్లు నేను చేయిస్తాను," అన్నాడు.

ఆ ఏర్పాట్లు చేసే పని విదురుడికి అప్పగించారు. అవి బ్రహ్మాండంగా జరిగాయి. అస్త్ర విద్యా ప్రదర్శనకు తగిన విశాలమైన






ప్రదేశాన్ని శుభ్రం చేసి, రాళ్ళూ, పొదలూ తీసిపారేసి చదునుచేసి, ప్రేక్షకులు కూర్చు నేటందుకు చుట్టూ ఇల్లులాగా కట్టి, ఉత్త రపు దిక్కున ప్రవేశద్వారం ఏర్పాటు చేశారు.

ఒక మంచి రోజున ప్రదర్శనకు ఏర్పాటు జరిగింది. ప్రదర్శన చూడటానికి పెద్దలందరూ బయలుదేరి వచ్చారు. గాంధారీ, కుంతీ మొదలైన అంతఃపుర స్త్రీలు పల్లకీలలోనూ, డోలీలలోనూ వచ్చారు. అందరూ ఎవరి స్థానాలలో వారు కూర్చున్నాక ద్రోణుడు అశ్వత్థామను వెంటబెట్టుకుని వచ్చి, రంగ స్థలం మధ్య నిలబడ్డాడు. ఆయన శిష్యులం దరూ కవచాలూ, విల్లులూ, బాణతూణీరాలూ ధరించి, చేతుల్లో రకరకాల ఆయుధాలు పట్టుకుని ఉత్సాహంగా రంగం మీదికి వచ్చారు. అందరి లోకీ పెద్దవాడైన ధర్మరాజు ముందూ, మిగిలిన వారు అతని వెనకా రంగప్రవేశం చేశారు.

అందరూ రథాల మీదా, ఏనుగుల మీదా, గుర్రాల మీదా రంగస్థలంలో అనేక విన్యాసాలు చేసి తమ అస్త్ర కౌశలాలు ప్రదర్శించారు; విలువిద్యలో తమ సామర్థ్యాలు చూపారు. బాణాలు తమకెక్కడ తగులుతాయోనని ప్రేక్షకులు భయపడ్డారు.

రంగస్థలంలో జరుగుతున్నదంతా ధృత రాష్ట్రుడికి విదురుడూ, గాంధారికి కుంతీ వివరిస్తూ వచ్చారు.

కొంతసేపయ్యాక భీమదుర్యోధనులు గద లతో రంగంలోకి దిగి యుద్ధం ఆరంభించారు. అది ప్రదర్శన కొరకు ఏర్పాటు చేసిన యుద్ధమే అయినా ప్రేక్షకులు కొందరు భీముణ్ణీ,మరి కొందరు దుర్యోధనుణ్ణీ మెచ్చుగొట్టటం ప్రారం భించేసరికి ద్రోణుడు గదాయుద్ధం నిలుపు చేయించమని అశ్వత్థామను హెచ్చరించాడు.

చివరకు అర్జునుడు రంగం మీదికి వచ్చాడు. అతన్ని చూడగానే ప్రేక్షకులు హర్ష ధ్వానాలు చేశారు. ధృతరాష్ట్రుడు విదురుణ్ణి, "ఆ కలకలం ఏమిటి?" అని అడిగితే విదు రుడు చెప్పాడు.

అర్జునుడి ప్రదర్శనం ఊహించరానంత అద్భుతమనిపించింది. అతను దివ్యాస్త్రాలను

ప్రయోగించి గాలీ, నిప్పూ, మేఘాలూ మొదలైనవి సృష్టించాడు. ఒక అస్త్రంతో అంతర్ధానమయ్యాడు. అతని లక్ష్యసిద్ధి అమోఘం. గుండ్రంగా తిరిగే పందిబొమ్మ ముఖాన ఒకేసారి అయిదు బాణాలు గుచ్చుకునేలాగా కొట్టాడు. ఒక్క ఆవు కొమ్ములో ఇరవై ఒక్క బాణాలు గురి తప్పకుండా గుచ్చుకునేటట్టు వేశాడు.

కుర్రవాళ్ళందరూ తమ తమ విద్యలు ప్రదర్శించి, రంగస్థలం నుంచి నిష్క్రమించిన తరవాత అక్కడికి, సహజ కవచ కుండలాలతో బాల సూర్యుడిలాగా వెలిగిపోతూ, కర్ణుడు ధనుర్బాణాలు ధరించి వచ్చాడు. అతను ద్రోణాచార్యుడికీ, కృపాచార్యుడికీ నమస్కరించి, గంభీరమైన స్వరంతో, "ఓరీ, అర్జునా! ధనుర్విద్యలో నువ్వే మొనగాడవనుకోకు. నువ్వు ప్రదర్శించిన విద్యలన్నిటినీ నేను కూడా ప్రదర్శిస్తాను," అన్నాడు.

ఆ మాటతో అర్జునుడికి కోపమూ, అవమానమూ కలిగాయి; ప్రేక్షకుల్లో ఆసక్తి కలిగింది. నిజంగానే కర్ణుడు, అర్జునుడు ప్రదర్శించిన విద్యలన్నీ తానూ ప్రదర్శించాడు. వెంటనే దుర్యోధనుడూ, అతని తమ్ములూ వచ్చి కర్ణుణ్ణి కౌగలించుకుని, అభినందించి, "ఈనాటి నుంచీ నువ్వు మాకు ఆప్తుడివిగానూ, మాలో ఒకడివిగానూ ఉండు. మా శత్రువులను నాశనం చేసి, మాకు మేలు చెయ్యి," అన్నారు.

కర్ణుడు అందుకు సమ్మతించి, తనను అర్జునుడితో ద్వంద్వ యుద్ధం చెయ్యనివ్వమని ద్రోణాచార్యుణ్ణి అడిగాడు. అర్జునుడు అందుకు వెంటనే సిద్ధమయ్యాడు. తన కొడుకులు యుద్ధానికి తలపడటం చూసి కుంతి మూర్ఛపోయింది. చెలికత్తెలు ఆమెను సేదదీర్చారు.

అప్పుడు కృపుడు కర్ణుడితో, "నాయనా, నీ కులమేది? నువ్వు ఎక్కడివాడవు? నీ తల్లిదండ్రు లెవరు? నువ్వు సుక్షత్రియుడివైతే తప్ప అర్జునుడు నీతోద్వంద్వయుద్ధం చేయగూడదు," అన్నాడు.

కర్ణుడు తనను పెంచినవారి పేర్లు చెప్పటానికి సిగ్గుపడిపోయాడు.





# మంచన్న మంచితనం

కొండాపురం గ్రామంలో రామయ్య అనే ధనిక రైతు వుండేవాడు. ఆ కారణంగా గ్రామస్థులందరూ అతణ్ణి గౌరవించేవారు. కానీ రామయ్య మాత్రం ఎంతో దర్పంగా వ్యవహరిస్తూ,ముఖ్యంగా తన పొలంలో పని చేసే పాలేళ్ళను చాలా హీనంగా చూసేవాడు.

రామయ్యకు ముగ్గురు కొడుకులు. పెద్ద వాళ్ళిద్దరూ తండ్రికి విధేయులై ఆయనకు తగిన వారసులనిపించేవారు. ఆఖరివాడైన మంచన్న మాత్రం స్వభావంలో వాళ్ళకు పూర్తిగా వ్యతిరేకి.

"కాలే కడుపు నింపుకోవడం కోసం మన దగ్గర పనిచేస్తున్న వాళ్ళను, బాగా ఆదరించిన నాడే వాళ్ళు మన బాగుకోరుకుంటారు. యజమానులమన్న అహంకారం, కాలం కలిసిరాక ఏవైనా కష్ట పరిస్థితులు సంభవిస్తే, మనకు మరింత కీడు చేస్తుంది. అందరినీ ఆదరభావంతో చూసే మనస్తత్వం, అలాంటి సమయం లోమనకెంతో ఉపకరిస్తుంది," అనేవాడు మంచన్న.

ఇలాంటి మాటలు విన్నప్పుడు మంచన్న తండ్రీ, అన్నలు, "పాలేళ్ళను వాళ్ళ హద్దుల్లో వుంచక నెత్తికెక్కించుకుంటే, మన పతనం ఖాయం. అలా మాట్లాడడం గొప్పనుకోకు!" అని హెచ్చరించేవాళ్ళు.

ఇలా వుండగా — రామయ్య దగ్గర చాలా కాలంగా పాలేరు పనిచేస్తున్న గోపన్న అనేవాడు దూరబంధువొకరు చనిపోవడంతో, పులి దిండి అనే గ్రామంలో ఒక ఎకరం పొలానికి వారసుడయ్యాడు. వాడు రామయ్యకు సంగతి చెప్పి, "అయ్యా! మీ ఉప్పు, పులుసు తిని ఇంతకాలం బతికాను. మీరనుమతిస్తే, నా భార్యాబిడ్డలతో పులిదిండి గ్రామానికి వెళ్ళిపోతాను," అన్నాడు.

రామయ్య వాడికేసి అసూయగా చూస్తూ, "గోచిపాతంత సొంత పొలం దొరికింది కదా

జె. ఉదయనాగశిరీష



భార్యతో పులిదిండి గ్రామంచేరి సొంత వ్యవసాయం చేసుకోసాగాడు.

పాలేరుతనంలో ఏమీ వెనకేసుకోలేకపోయిన గోపన్న, వ్యవసాయం పెట్టుబడి కోసం, ఇంటి ఖర్చుల కోసం భారీగా అప్పు చేయవలసి వచ్చింది. ఇది తెలుసుకున్న పొరుగురైతు గోపన్నతో, "చూడు, గోపన్నా! నీ ఎకరం పొలంలో ఒక అరెకరం పొలం వ్యవసాయం నువ్వు చేసుకో.మిగిలినఅరెకరం నాకమర్చు. ఆ అరెకరానికి పెట్టుబడి పెట్టి నేను వ్యవసాయం చేస్తాను. ఖర్చులు నావి కాబట్టి ఫలసాయంలో సగం నీకిస్తాను. అది మిగిలిన నీ అరెకరానికీ పెట్టుబడి పెట్టుకో. నాకూ, నీకూ కూడా లాభం!" అన్నాడు.

అని, పాలేరు పనిలో వున్న నియమాలు మరిచిపోతే ఎలా? ఇష్టమున్నా లేకపోయినా, ఒకసారి పాలేరుగా చేరాక తొలి ఏకాదశి వచ్చే వరకూ పనిచేయాలన్నది ఒప్పందం. తొలి ఏకాదశికి ఇంకా రెండునెలలుంది. ఆ రెండు నెలలూ నువ్వు పనిచెయ్యాలి. కాదంటావా? ముందే జీతంగా నేను కొలిపించిన గింజలు తిరిగి ఇచ్చెయ్యి. పాలేర్లు మధ్యలో పనిమానేసి వెళ్ళిపోయే పద్ధతి ప్రవేశపెడితే, మిగిలిన రైతులు నా మీద మండిపడతారు," అన్నాడు.

గోపన్న చేసేది లేక తొలి ఏకాదశి దాకా కొండాపురంలోనే వుండిపోయాడు. ఆతర్వాత యజమాని దగ్గర సెలవు తీసుకుని యుక్త వయసు వచ్చిన కూతురు, పదేళ్ళ కొడుకు,

గోపన్నకు ఈ ఏర్పాటు మేలయింది. అతడు సొంత వ్యవసాయం మీద ఏలోటూ లేకుండా సుఖంగా బతకసాగాడు.

ఈ స్థితిలో గోపన్న, తన కూతురుకు పెళ్ళి సంబంధం కుదుర్చుకున్నాడు. అతడు స్వయంగా కొండాపురం వెళ్ళి, తన పాత యజమాని రామయ్యను పెళ్ళికి రావలసిందిగాఆహ్వానించాడు. ఇందుకు రామయ్య, అతడి పెద్దకొడుకులిద్దరూ అయిష్టంగా మాట్లాడినా, మంచన్న మాత్రం అతణ్ణి ఒంటరిగా కలుసుకుని, "గోపన్నా! నువ్వు చాలాకాలం నమ్మకంగా మా దగ్గర పనిచేశావు. తండ్రి చాటు బిడ్డగా ఇప్పుడు నీకు ఒక్క రూపాయి కూడా ఇవ్వలేనందుకు బాధగా వుంది. కానీ

నీ కూతురు పెళ్ళికి మాత్రం తప్పకుండా వస్తాను," అని చెప్పాడు.

అలా అన్నమాట ప్రకారం తండ్రి, అన్నలు వెటకారం చేస్తున్నా మంచన్న, గోపన్న కూతురు పెళ్ళికి పులిదిండి గ్రామం వెళ్ళాడు. ఆ సమయంలో, గోపన్న అరెకరం పొలాన్ని సాగు చేస్తున్న పొరుగు రైతు అకస్మాత్తుగా కాలం చేశాడు. పెళ్ళి సందర్భంలో అతడు కట్నానికి సరిపడా డబ్బివ్వవలసివుంది. తనింట్లో శుభ కార్యం కోసం, విచారంలో మునిగి వున్న పొరుగు రైతు కుటుంబం వాళ్ళను డబ్బుడగ కూడదనుకున్నాడు గోపన్న.

అయితే, మగపెళ్ళివారు సరిగ్గా పెళ్ళి పీటలమీద ఇవ్వవలసిన కట్నం డబ్బు ఇవ్వమని పట్టుబట్టారు. గోపన్న ఏమీ చేయలేక, మంచన్నను చూసి, "నా పరిస్థితి మీకు తెలియంది కాదు. కొండాపురం భూస్వామి గారి అబ్బాయిగా పెళ్ళివారికి నచ్చ చెప్పండి," అని కోరాడు.

మంచన్న, పెళ్ళి కొడుకు తండ్రికి పరిస్థితి వివరించాడు. అయినా, అతడు తన పట్టు వదలక, "ఆ చనిపోయాడనే పొరుగు రైతు లోగడే డబ్బిచ్చేశాడేమో ఎవరికెరుక! ఒక పని చెయ్యమనండి. ఒక అరెకరం పొలం పెళ్ళికొడుకు పేరు మీద రాసివ్వమనండి. లేదా, ఈ పెళ్ళి జరగదు," అనేశాడు.

గోపన్న పెళ్ళికొడుకు పేర అరెకరం రాయడానికి సిద్ధపడ్డాడు. కానీ అతడి కూతురు సుభాషిణి అందుకు ఒప్పుకోక, "కాబోయే వియ్యంకుడి మాట నమ్మలేని సంబంధం





ఇదే ముహూర్తానికి నేను అన్ని కష్టాలకూ సిద్ధపడి, మీ అమ్మాయిని చేసుకుంటాను," అన్నాడు.

గోపన్నకు, మంచన్న తండ్రి రామయ్య పెద్ద ఆస్తిపరుడని తెలుసుగనక, ఇందుకు ఒప్పుకోలేదు.కానీమంచన్న అతడితో, "పీటల మీద పెళ్ళి ఆగిపోతే, నీ కూతుర్ని చేసుకునేం దుకు ఎవరూ ముందుకురారు. నా కుటుంబం వాళ్ళకు నేను నచ్చచెప్పుకుంటాను. ఈ పెళ్ళిని కాదనకు," అని బలవంతపెట్టాడు.

ఈ విధంగా, అనుకున్న ముహూర్తానికి గోపన్న కూతురు సుభాషిణితో, మంచన్నకు పెళ్ళి జరిగిపోయింది.

భార్యను తీసుకుని ఇంటికి వచ్చిన మంచన్న మీద, అతడి తండ్రీ, అన్నలూ మండిపడ్డారు. బాగా ఆలోచించిన మీదట మర్నాడు రామయ్య, మంచన్నతో, "కన్న కొడుకువి కాబట్టి నీకు కొంత డబ్బిస్తాను. నేనీఊళ్ళో తలెత్తుకు తిరగాలంటే, నీ భార్యను తీసుకుని ఎటన్నా వెళ్ళిపో!" అన్నాడు.

మంచన్న, తండ్రి ఇచ్చిన డబ్బు తీసుకుని పులిదిండి గ్రామానికి వెళ్ళాడు. అక్కడ కొంత పొలం కౌలుకు తీసుకుని, ఆ డబ్బు పెట్టుబడిగా వ్యవసాయం ప్రారంభించి, నాలుగైదేళ్ళు గడిచే సరికి సొంతానికి కొంత పొలం కొన్నాడు. అవసర సమయంలో గ్రామ స్థులకు మంచి సలహాలిస్తూ,పరోపకారి అన్న పేరు కూడా గడించాడు.

నాకొద్దు. వాళ్ళు వట్టి డబ్బు మనుషులు," అనేసింది చిరాకుపడుతూ.

ఈ మాటలు మగపెళ్ళివారికి ఆగ్రహం తెప్పించాయి. "ఆడదానికింత అహంకారం పనికిరాదు. కానీ కట్నం లేకుండా తాలికట్టే వాణ్ణే చేసుకో!" అని రకరకాలుగా మాట్లాడుతూ పెళ్ళిపందిరిలోంచి వెళ్ళిపోయారు.

పెళ్ళివారు వెళ్ళిపోతూంటేదిగులుగా కూర్చు న్నాడు గోపన్న. అప్పుడు మంచన్న, "నాకు చిన్నప్పటి నుంచీ మనుషుల మంచితనం తప్ప, ఉన్నవాడు లేనివాడు అన్న తేడాలు తెలియవు. నీకూతురు సుభాషిణిని చిన్నప్పటి నుంచీ నేనెరుగుదును. ఆమె స్వాభిమానం నాకు నచ్చింది. నీకు అభ్యంతరం లేకపోతే,

ఇలా వుండగా, ఒక వర్ష ఋతువులో ఉప్పెన వచ్చి సముద్రం పొంగి, దాపుల వున్న చాలా గ్రామాలనూ, పంటపొలాలనూ ఉప్పునీటి మయం చేసింది. కొండాపురం సముద్ర సమీప గ్రామం. పొలాలన్నీ సముద్రపు నీరు చేరడంతో పనికి రాకుండా పోయాయి. దానితో గ్రామంలో పెద్ద రైతు రామయ్యకూ, అతడి పాలేర్లకూ తేడా లేకుండా పోయింది. అందరూ తమ తమ కుటుంబాలతో ఉప్పెన ప్రాంతానికి దూరంగా తరలిపోసాగారు.

ఇది విన్న మంచన్నా, పులిదిండి గ్రామస్థులూ నిరాశ్రయులైన వారికి తమ గ్రామంలో ఆశ్రయం కల్పించి, తమకు చేతనైన సాయం చేయసాగారు. ఆ సమయంలో మంచన్నకు తన తండ్రీ, అన్నలు కూడా గ్రామం విడిచి ఎక్కడికో బయలుదేరినట్టు తెలిసింది. వెంటనే అతడు, భార్యనూ,మామ గోపన్ననూ వెంట బెట్టుకుని బయలుదేరాడు.

వాళ్ళకు గ్రామ పొలిమేరల్లో కట్టుబట్టలతో, కొండంత దిగులుతోదిక్కులుచూస్తూ వస్తున్న రామయ్యా, అతడి ఇద్దరు కొడుకులూ కనిపించారు. రామయ్యతన కొడుకునూ, కోడలినీ చూస్తూనే దుఃఖంతో కంట తడి పెట్టుకున్నాడు.

మంచన్న, తండ్రి చేతులు పట్టుకుని, "ఇప్పుడు విచారపడవలసిందేమీలేదు.కలిమి లేములు కావడికుండలు. ఉప్పు నీటితో చవుడు పట్టిన మన పంట పొలాలు తిరిగి బాగు పడడానికి నాలుగైదేళ్ళన్నా పడుతుంది. అప్పటివరకూ మనమందరం ఇక్కడ కలిసి కట్టుగా వ్యవసాయం చేసుకుందాం. మనలో ఎవరూ యజమానులూ కాదు, పాలేర్లూ కాదు!" అన్నాడు.

తాము కోరేదీ అదే నన్నట్టుగా మంచన్న భార్యా, గోపన్నా తలలు వంచి రామయ్యకు నమస్కరించారు.

మంచన్న మంచితనం చూసి రామయ్యతో పాటు అతడి కొడుకులిద్దరూ చాలా సంతోషించారు. ఆ క్షణంలోనే వాళ్ళల్లో వున్న స్వార్థం, పేదలపట్ల గల చులకన భావం నశించాయి. మంచన్న, గోపన్నల సాయంతో కొత్త జీవితం ప్రారంభించారు.





# అత్యాశ

ఒకానొక దేశంలో ఒక పేదవాడుండే వాడు. వాడు చుట్టుపక్కల గ్రామాలన్నీ తిరిగి అడుక్కుంటూ ఉండేవాడు. పొలాలలో పనులు జరిగే రోజుల్లో కూలిజనం తాము తినేదాన్లోనే వాడికి ఇంత ఇచ్చేవారు. కాని ఆ తరవాత వాడికేమీ దొరికేది కాదు. ఇళ్లకు పోయి అడుక్కున్నా కుక్కలు మీద పడేవే తప్ప అట్టే ప్రయోజనం ఉండేది కాదు. అటువంటప్పుడు వాడు రోజుల తరబడి తిండికి మాడేవాడు.

ఒక యేడు ఆ బిచ్చగాడికి ఇదే గతి పట్టింది. రెండు రోజుల పాటు తిండిలేని స్థితిలో వాడు ఒక గ్రామం నుంచి ఇంకో గ్రామానికి బయలుదేరాడు. దారిలో ఒక ముసలివాడు ఎదురుపడి, "పాపం, డొక్క అంటుకుపోయినట్టుంది. ఇంద, ఈ శనగ గింజ తీసుకో!" అంటూ బిచ్చగాడి చేతిలో ఒక శనగగింజ పెట్టాడు. "దీంతో కడుపు నిండుతుందా, బాబూ?" అన్నాడు బిచ్చగాడు.

"దీన్ని తినేస్తే నీకేం లాభం? ఇది నీవద్ద ఉన్నదంటే ఎవరుపడితే వారు నీకు అతిథ్యమిస్తారు. అప్పుడు నువ్వు తిండికి మాడవలసిన అవసరం ఉండదు," అన్నాడు ముసలివాడు.

తరవాత ఎవరి దారిన వారు వెళ్ళారు. చీకటిపడే వేళకు బిచ్చగాడు పక్క గ్రామంచేరుకుని ఒక ఇంటిముందు నిలబడి, "కాస్త అన్నం పడేయించండి, నాయనా!" అని కేక పెట్టాడు.

వెంటనే ఇంటి యజమాని బయటికి వచ్చి బిచ్చగాణ్ణి చూసి, తమ గ్రామం వాడు కాడని తెలుసుకుని లోపలికి పిలుచుకు వెళ్లి, కడుపునిండా భోజనం పెట్టించాడు. "ఇవాళ రాత్రికి నువ్వు మా ఇంటి పంచలోనే పడుకోవచ్చు. ఈ చీకట్లో ఇప్పుడు ఎక్కడికి పోతావు?" అన్నాడు ఇంటి యజమాని బిచ్చగాడితో.

బిచ్చగాడికి పరమానందమయింది. వాణ్ణి ఎవరు కూడా ఎన్నడూ ఇంత ఆదరంతో

చూడలేదు. ఇదంతా శనగగింజ ప్రభావమే అయి ఉండాలని వాడనుకున్నాడు. ఆ శనగ గింజను భద్రంగా తన తలకు దగ్గిరగా ఉంచి, ఆ రాత్రి వాడు సుఖంగా నిద్రపోయాడు.

తెల్లవారుజామున ఇంటివాళ్ళ కోడి బిచ్చ గాడు పడుకుని ఉన్న చోటికి వచ్చింది. అది చేసిన చప్పుడుకు బిచ్చగాడు నిద్ర లేచాడు. అంతలోనే ఆ కోడి కాస్తా శనగగింజను ముక్కుతో పట్టుకుని క్షణంలో మింగేసింది.

"అయ్యో, నా శనగగింజ! కోడి మింగే సింది!" అని బిచ్చగాడు శోకాలు పెట్టసాగాడు.

ఇంటి యజమాని ఈ కేకలు విని వచ్చి, జరిగిన సంగతి తెలుసుకుని, "ఒక్క శనగ గింజ కోసం ఇంత విచారించాలా? సోలెడు గింజలిస్తాను, పట్టుకు పో!" అన్నాడు.

"నాకు సోలెడు శనగలు అక్కర్లేదు, నా గింజే కావాలి. అది అదృష్టం గల గింజ. దాన్ని నాకొక సిద్ధుడిచ్చాడు," అన్నాడు బిచ్చగాడు.

"అలా అయితే నేనేం చేసేది! ఆ శనగ గింజ కోడి పొట్టలో ఉన్నదిగదా? ఆ కోడిని స్తాను, తీసుకుపో!" అన్నాడు ఇంటి యజమాని.

కోడిని బస్తీలో అమ్మితే నాలుగు డబ్బులు వస్తాయన్న ఆశతో బిచ్చగాడు కోడిని తీసుకుని ఆ గ్రామం నుంచి బయలుదేరాడు. అతను ఆ రోజు బస్తీ చేరుకోలేకపోయాడు. అందుచేత ఆ రాత్రికి ఒక ఆసామీని ఆతిథ్యం అడిగాడు. ఆసామీ సంతోషంగా సమ్మతించాడు. బిచ్చ గాడు ఆరాత్రి మళ్ళీ సుఖంగా భోజనం చేసి,



తన కోడిని పక్కనే పెట్టుకుని పడుకున్నాడు. వాడికి కాస్త కునుకు పట్టగానే వాడి కోడి దొడ్లోకి వెళ్లి ఇంటివాళ్ల కోళ్లతో జగడం పెట్టు కున్నది. అవి అన్నీ ఏకమై బిచ్చగాడి కోడిని పొడిచి తరమసాగాయి. వాటి నుంచి తప్పిం చుకుని పారిపోయే ప్రయత్నంలో బిచ్చగాడి కోడి ఒక పెయ్యదూడ కాళ్ల సందున దూరి, దాని కాలి కింద పడి చచ్చిపోయింది.

"అయ్యో, నా కోడి! నా బంగారు కోడి!" అని బిచ్చగాడు ఆవేశంగా అరవసాగాడు. వాడికి ఆతిథ్యం ఇచ్చిన ఆసామీ రెండు కోళ్లిస్తానన్నా వినక బిచ్చగాడు పెయ్యదూడ నిమ్మన్నాడు. ఆసామీ ఒప్పుకుని పెయ్యదూడ నిచ్చేశాడు. దాన్ని పలుపుతో కట్టి తన వెంట



బెట్టుకుని బిచ్చగాడు బస్తీకి బయలుదేరాడు. వాడు బస్తీలో అడుగుపెట్టే లోపలనే పొద్దూకి పోయింది. అందుచేత ఊరి బయట ఉన్న ఒక పెద్ద లోగిలి చూసుకుని బిచ్చగాడు ధైర్యంగా లోపలికి ప్రవేశించి, గృహస్థుతో, "అయ్యా, నేను చాలా దూరం నుంచి వస్తున్నాను. ఈ బస్తీలో ఎరిగినవారెవరూ లేరు. ఈ రాత్రికి మీ ఇంట బస చెయ్యనిస్తారా?" అని అడిగాడు. గృహస్థు సమ్మతించాడు.

ఆరోజు ఆ గృహస్థు ఇంట ఏదో అక్కర జరిగింది. అందుచేత చాలామంది బంధువులు వచ్చి వున్నారు. ఆ రాత్రి పెద్ద ఎత్తున విందు చేశారు. బిచ్చగాడు నలుగురితో బాటు సుష్టుగా భోజనం చేశాడు. ఒకరాత్రి వేళ ఆ పెయ్యదూడ పలుపు తెంచుకుని, ఇంటివారి గుర్రం ఉండేచోటికి వెళ్ళి గడ్డి తినసాగింది. ఆ గుర్రం కాస్తా పెయ్యదూడను తన వెనక కాళ్లతో బలంగా తన్నింది. గిల గిలా తన్నుకుని పెయ్యదూడ చచ్చింది.

మర్నాడు బిచ్చగాడు గృహస్థుతో పోట్లాట పెట్టుకున్నాడు. గృహస్థు సౌమ్యుడు. ఇంటికి వచ్చి ఉన్న బంధువుల మధ్య ఎవడో పరాయి వాడితో పేచీపడి పోట్లాడటం ఇష్టం లేక ఆయన బిచ్చగాడికి తన గుర్రాన్ని ఇచ్చాడు.

బిచ్చగాడా గుర్రాన్ని ఎక్కి సవారీ అయి దూరాన ఉన్న పట్టణానికి బయలుదేరాడు. దారిలో వాడు, "ఇక నా అదృష్టం తిరిగిపోయింది. ముసలివాడిచ్చిన శనగగింజ మహా గొప్పది. ఇలా గుర్రాలూ, గాడిదలూ సంపాదించటం కాదు, ఈసారి మంచి ఇల్లూ, చక్కని పెళ్లామూ, ఇంత ఆస్తీ వచ్చేటట్టు చూసుకోవాలి. ఈ సంచారం ఇంతటితో కట్టిపెట్టి ఒకచోట స్థిరపడి పోవాలి," అనుకున్నాడు.

ఆ సాయంకాలానికి వాడు నగరం ప్రవేశించాడు. వీధివెంబడి పోతూండగా ఒక పెద్ద సత్రమూ, ఆ సత్రం వాకిట ఒక అందమైన పిల్లా వాడి కంట పడ్డారు. ఆ పిల్లను చూడగానే వాడికి అలాటి భార్య ఉంటే బాగుంటుందనిపించింది. అందుచేత వాడు గుర్రం దిగి సత్రంలోకి వెళ్ళి, అక్కడి గుమాస్తాను బస కావాలని అడిగాడు. గుమాస్తా బిచ్చగాడికి ఒక గది చూపించాడు.

బిచ్చగాడు చూసిన అమ్మాయి ఆ గుమాస్తా కూతురే. ఆమె తప్ప గుమాస్తాకు మరొక సంతానం లేదు. ఆమెను తాను పెళ్లి చేసుకుంటే తాను కూడా ఆ సత్రంలోనే ఉండిపోవచ్చు. ఆ విధంగా తనకు ఇల్లూవాకిలీ, భార్యా, భోజన సౌకర్యమూ, అన్నీ అమరుతాయి.

అందుచేత బిచ్చగాడు సత్రం గదిలో ప్రవేశిస్తూ గుమాస్తాతో, "అయ్యా, నా గుర్రానికి నీరు పెట్టటమూ, దాణా వెయ్యటమూ మొదలైనవి శ్రద్ధగా చూడండి. అది చాలా విలువైన గుర్రం. మామూలు గుర్రాల లాటిది కాదు," అన్నాడు.

ఆ గుర్రం గురించి దాని యజమాని అంతగా చెప్పాడుగదా అని, దాన్ని నీళ్లతొట్టి దగ్గరికి గుమాస్తా స్వయంగా తీసుకు వెళ్ళాడు. అది నీరు తాగినంతసేపు తాగి గుమాస్తా ఏమరుపాటున ఉన్న సమయంలో బయటికి పరిగెత్తి పోయింది. గుమాస్తా బిచ్చగాడి వద్దకు వచ్చి, జరిగిన సంగతి చెప్పాడు. బిచ్చగాడు తోక తొక్కిన తాచులాగా లేచి, "నేను ముందే చెప్పలేదా? అంత పొగరా? ఆ గుర్రం విలువ నీకేం తెలుసు. దానికోసం నేను నాకున్నదంతా త్యాగం చేశాను. నా గుర్రాన్ని నాకు ఇప్పుడే తెచ్చి పెట్టు. నేను తెల్లవారుతూనే పెద్ద రాచకార్యం మీద వెళ్ల వలసి వున్నది,!" అని కేకలు పెట్టాడు.

"తెల్లవారనివ్వండి. నేను ఎంత శ్రమ అయినా పడి తమ గుర్రాన్ని వెతికి ఇప్పి



స్తాను!" అని గుమాస్తా ఎంతగానో ప్రాధేయపడ్డాడు.

"నీ కూతురు కనబడకుండా పోతే తెల్లవారేదాకా ఆగుతావా? నాకు నా గుర్రం అంతకంటే లక్ష రెట్లు ఎక్కువ!" అన్నాడు బిచ్చగాడు కోపంగా.

"అయితే ఈ నడిరాత్రి నన్నేం చేయమంటారు?" అన్నాడు గుమాస్తా చిరాకుపడుతూ.

"నా గుర్రాన్ని పోగొట్టావు గనక నీ కూతుర్ని ఇయ్యి!" అన్నాడు బిచ్చగాడు. గుమాస్తాకు కోపం వచ్చింది. ఇద్దరూ ఘర్షణ పడసాగారు. సత్రం గుమాస్తా భార్య వచ్చి, తన భర్తతో, "తప్పంతా మీదే! మీరూరుకోండి. అమ్మాయి ఇష్టపడితే అలాగే ఇద్దాం! ఎప్పటికైనా ఒక

అయ్యచేతిలో పెట్టక తప్పదు కదా! కావాలంటే మటుకు మన కింతకన్న మంచి అల్లుడు దొరుకుతాడా? నేను వెళ్లి అమ్మాయి ఇష్టం కనుక్కుని వస్తాను. ఈలోపుగా మీరు పోట్లాడుకోకండి!" అన్నది. బిచ్చగాడు తన అదృష్టం పండిందనుకున్నాడు.

మరి కాస్సేపటికల్లా గుమాస్తా భార్య హడావుడిగా తిరిగివచ్చి, "అయ్యా, అమ్మాయి మిమ్మల్ని పెళ్లాడటానికి సుతరామూ ఒప్పుకోలేదు. అందుచేత దాన్ని ఒక గోతంలో వేసి కట్టి పెట్టాను. మీరు ఆ గోతం తీసుకుని ఇప్పుడే బయలుదేరి వెళ్లిపోండి. ఈ రాత్రి చీకట్లో మీరు ఎటు వెళ్లారో దానికి తెలీదు గనక తెల్లవారి గోతం నుంచి బయటికి తీస్తే అది ఇంటికి పారిపోయి రాలేదు. అప్పుడు మీరు నయానో, భయానో దాన్ని పెళ్ళికి ఒప్పింతురు గాని!" అన్నది.

ఇలా జరుగుతుందని బిచ్చగాడు అనుకోలేదు. అయినా గుమాస్తా భార్య చెప్పిన సలహా బాగానే ఉన్నట్టు వాడికి తోచింది. మొదలు తానా పిల్లను పెళ్ళాడితే తరవాత ఇద్దరూ కలిసి సత్రానికి వచ్చి ఇక్కడే కాపురం పెట్టవచ్చు.

అందుచేత వాడు గోతాన్ని భుజాన ఎత్తుకుని ఆ నిశిరాత్రి వేళ బయలుదేరాడు. గోతం ఎక్కువ బరువుగా లేదుగాని, లోపల ఉన్న మనిషి తన్నుకుంటూ ఉండటం చేత ఎత్తుకుని మోయటం బహు ప్రయాస అయింది. దానికి తోడు కన్ను పొడుచుకున్నా కనపడని చీకటిలో తెలియని దారిన నడవవలసి వచ్చింది. అట్లాగే బిచ్చగాడు ఆ గోతాన్ని మోస్తూ, తెల్లవార్లూ నడిచి తెల్లవారేసరికి ఒక అడివి మధ్యకు చేరాడు.

అక్కడ వాడు గోతాన్నిదింపి,ఎంతో ఆశగా గోతం మూతి విప్పాడు. ఆ గోతంలో నుంచి ఒక పెద్ద కుక్క పైకి దూకి, అతని ముక్కు కాస్తా కొరికి శరవేగంతో ఎటో పారిపోయింది.

శనగగింజ తెచ్చిన అదృష్టం అంతటితో అయిపోయింది. తెగిపోయిన తన ముక్కుకు చెయ్యి అడ్డం పెట్టుకుని బిచ్చగాడు మళ్లీ గ్రామాల వెంట తిండి అడుక్కుంటూ జీవయాత్ర సాగించాడు.



# ప్రకృతి వింతలు

## ప్రమాదకరమైన చేప!

మద్రాసు నగరం మెరీనా తీరంలోని మత్స్య ప్రదర్శనశాలలోకి ఇటీవల ఒక చేపను తెచ్చారు. దీనికి సీతాకోకచిలుక వంటి రెక్కలు, వీపుమీద బాణాల వంటి కుచ్చులు ఉన్నాయి. వీటి రెక్కలు, ఇతర సముద్ర ప్రాణులను దగ్గరికి రానీయకుండా భయపెడతాయి. 'రస్సల్స్ స్కార్పియన్ ఫిష్' అనే ఈ చేపను గురించి 1930 ప్రాంతాలలో ప్రచురించబడిన ఒక పుస్తకంలో – చాలా విషపూరితమైనది. వీపు; రెక్కలలోని ముల్లుతో తీవ్రంగా గాయపరుస్తుంది, అని వివరించబడి వున్నది. అందువల్ల ఆ రోజులలో దీనిని సముద్రంపాము కన్నా ప్రమాదకరమైనదిగా భావించి భయపడేవాళ్ళు. ఈ రకం చేప సముద్ర జలంలో మాత్రమే బతకగలదు. కాబట్టి దీని తొట్టెను క్రమం తప్పకుండా సముద్రజలాలతో నింపుతున్నారు.

## మొరిగే 'జింక'!

మద్రాసు సమీపంలోని వండలూరు జంతు ప్రదర్శనశాలలో ఇటీవల ఒక జింకపిల్ల పుట్టింది. దీని కళ్ళు చాలా అందంగా, చురుకుగా వుంటాయని దగ్గరికి వెళ్ళామో కుక్కలాగా మొరుగుతుంది. అందుకే దీనిని మొరిగే జింక అంటున్నారు.

## తెల్ల 'కాకి'

తెల్లకాకిని ఎప్పుడయినా చూశారా? లేదనే చెబుతారు. అయితే మద్రాసు గిండీలోని చిల్డ్రన్స్ పార్క్‌కు వెళ్ళి చూడండి కనిపిస్తుంది. లేత ఎరుపు కళ్ళతో, పాలలా తెల్లగా కనిపించే ఈ 90 దినాల పక్షిపిల్ల, కాకి జాతికి చెందినదే. అయితే, చాలా అరుదుగా జరిగే శారీరక మార్పు వల్ల ఇది 'బొల్లి'గా కనిపిస్తున్నది. కోట్టూర్‌లో చెట్ల మధ్య నల్లకాకి పిల్లలు దీనిని పొడిచి తరుముతూ వుంటే ఎవరో చూసి, పట్టి తెచ్చి ఇక్కడి అధికారులకు అప్పగించారు!







Say "Hello" to text books and friends
'Cause School days are here again
Have a great year and all the best
From Wobbit, Coon and the rest!










It's time to go back to school again. Time for text books. Time for games. Time to meet old friends. And make new ones. Time to start studying again. Because there's so much to learn about the world around you.

From all of us here at Chandamama, have a great year in school. And remember to tell us what you've learnt everyday, when you come home from school !



THE
CHANDAMAMA
COLLECTION

ARTIG 1246

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1995 మార్చి నెల సంచికలో ప్రకటింపబడును.


S.G. Seshagiri


S.G. Seshagiri

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * జనవరి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : రమణీయం ప్రకృతిదృశ్యం! రెండవ ఫోటో : వినిపిద్దాం జయజయధ్వానం!

పంపినవారు : శ్రీమతి సరోజన C/o. ఆర్. జనార్ధన్ (టైలర్) ఇం. నెం. 9-4-2,

గిర్మాజీ పేట, వరంగల్ - 506 002 (ఆం.ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 60.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.